అభినవాంధ్ర గ్రంథమాల
రాజమండ్రి

నాటక గుచ్ఛము
తొమ్మిదో సుమము

# శ్రీ మాధవాచార్య విద్యారణ్య



శ్రీపాద కామేశ్వరరావు

# శ్రీమాధవాచార్య విద్యారణ్యస్వామి

శ్రీయుత నరసింహ చింతామణి కేళ్కరుగారి

మహారాష్ట్రనాటకమునకు తెలుగు

గ్రంథకర్త:

మాచిరాజు దుర్గాశంకర రామామాత్యుడు

పరిష్కర్త:

శ్రీపాద కామేశ్వరరావు





ప్రకాశకుడు:

చెఱుకువాడ వేంకటరామయ్య

జనేవరి 1927




మేలుప్రతి 1-4-0
సాదా,, 1-0-0

# పీఠిక

దక్షిణహిందూస్థాన చరిత్ర నెఱిగినవా రందరూ శ్రీ మాధవాచార్యులు విజయనగరరాష్ట్రమును స్థాపించిన మహా పురుషుడని ఎరుగుదురు. వేదాంతశాస్త్రపఠనము చేసినవారికి కూడా ఈ పేరు సుపరిచితమే.

అట్టి మహాత్ముని నాయకుని చేసి శ్రీమాన్ ఎన్.సి. కేళ్కరు బి. ఏ, ఎల్ఎల్. బి, ఎమ్. ఎల్. సి. గారు నాటకము వ్రాసినారు. దానిని శ్రీమాన్ మాచిరాజు దుర్గాశంకర మహాశయులు తెలుగుచేసి మా గ్రంథమాల కొసగి ఆంధ్ర మహాజనుల కృతజ్ఞతకు పాత్రులయినారు.

ఈ నాటకము Bulwer Lytton దొరగారి Richlieu అను నాటకమున కనుకరణము.

ప్రకాశకుడు.

# కుశీలవగణము.

| | | | |
|---|---|---|---|
| హరిదేవరాయలు | ... | ... | రాజు. |
| మాధవాచార్యులు | ... | ... | మంత్రి. |
| రుద్రదాముడు | ... | ... | సభ్యులు. |
| వీరవిజయుడు | ... | ... | |
| కృష్ణరాయుడు | ... | ... | రాజశ్యాలకుడు. |
| భీమసింహుడు | ... | ... | భటులు. |
| హనుమ | ... | ... | |
| మిళిందాచార్యుడు | ... | ... | బ్రాహ్మణులు. |
| శ్యామభట్టు | ... | ... | |
| రాణి | ... | ... | |
| హంసేశ్వరి | ... | ... | రాజుగారిఅన్నకూతురు |
| కంజాక్షి | ... | ... | వేశ్యలు. |
| మీనాక్షి | ... | ... | |

స రా:—గ్రంథమాలాప్రకాశకుని అనుమతి లేక ఈ నాటకము నాడరాదు.

రాజ్యతంత్రంబునందు ధర్మంబునందు
విప్లవము మాపి రాష్ట్రంబు వేదమతము
నుద్ధరించిన ధీరధీసిద్ధి కిద్ది
యంకితంబు విద్యారణ్య యతివరునకు.

మా॥ దు॥ శం॥




# మొదటి అంకము

---

## మొదటి రంగము

(విజయనగర చండికాలయమున హనుమ)

హను—దుర్జన సాంగత్యమువల్ల కీడు మూడునంటారు, కాని నా అశుభన మందుకు వ్యతిరేకముగా నంది-మాధవామాత్యులవారి ఆజ్ఞానుసారము నే నీ దుర్జనద్వయము వెంట నంటి యుండడముచేత నా కనాదినము చండికాదర్శన మవుతూన్నది-ఇది లాభమే కదా? వీరుభయులూ నిర్జనమైన ఇచ్చోటికి రోజూ వచ్చి ఏవో కుట్రలు పన్నుతూందురని వదంతి కద్దు-వీరి గుట్టు తెలుసుకోకుండా నేను గురువుగారి వద్దకు పోయిన ఫలమేమి? నేను వీళ్ళకి సమీపమందే ఉండి కనిపెట్టవలెను; గర్భగుడిలోకి పోయి దేవీప్రతిమ చాటున దాగి యుంటాను. అదిగో వాళ్ళిటే వస్తూన్నారు; ముందుగా నేను పోయెదను...(పోవును)

(కృష్ణరాయుడు రుద్రదాముడూ వత్తురు)

కృష్ణ—మిత్రమా, నీ వెంత ధైర్యము చిక్కబట్టు

మన్నా, ఈ యాలయము చూచేసరికి నా గుండె జారుతూంది సుమా!

రుద్ర—ఎందుచేత? ఈచోటు నిర్జన మవుటచేతనే రహస్యాలోచనలకు తగిందని ఇక్కడికి మిమ్ము తీసుకొని వచ్చినాను.

కృష్ణ—నిర్మానుష్యము గనుకనే నా మనస్సు కలవర పడుతూన్నది.

రుద్ర—కలవరము కాదు, ఔత్సుక్యమనండి.

కృష్ణ—ఆ మాట నా కర్థము కాలేదు.

రుద్ర—మన యత్నము సఫలము కాగానే మీరు యువరాజుపదవి నంది రాచకార్యములు నిర్వహించ వచ్చుననే ఔత్సుక్యమును ఇప్పటి కలవరము సంవకరునని తలచండి.

కృష్ణ—మన యత్నమంతా రాజద్రోహ మవుట చేతనే నాగుండె అదరుతూన్నది!

రుద్ర—రాజద్రోహమా! ఎందుచేత? విజయనగర సంస్థానమునకు రాణిగా రవుటవల్ల సగము హక్కు మీ అక్కగారిది కదా? అనగా మీ దన్నమాటే! అందుచేత రాజ్యము మీకు సంక్రమింపజేయుట మీ భృత్యులమైన మాకు విధి. ఇందు మేము కృతకృత్యులమైతే పరాక్రమవంతులమంటారు, లేకుంటే రాజద్రోహులమే. మా యావచ్ఛక్తి విఫలము కాకుండా మేము యత్నించుతూన్నాము కావున మనకు

రాజద్రోహాభీతి యుండనేరాదు. మీరు మాకు బాసటైతే మా యత్నము శీఘ్రముగా ఫలిస్తుంది.. ఇదిగో జాబు సిద్ధముగా నుంది, అందు మీరు సంతకము చేయుడమే కొరత; వెంటనే మాలిక్ కాఫరుకు దాని నందచేస్తాము. (ఉత్తరము చూపును.)

కృష్ణ—దేవీసమతుల్యుని బట్టి అకార్యము నేను చేయలేను.

రుద్ర—(జాబు విసిరి) అయితే ఇన్నింతదూరము రప్పించిన దందుకా? దుష్టుడైన మాధవాచారి, ఆ ఘాతకుడు, ఆ కపటసన్యాసి నియోగించిన చారులు నగరమంతటా తిరుగుతూన్నారు, నిర్జనములైన గోడలకీ చెవు లుంటూన్నవి, అని మిమ్మింతదూరము రప్పించవలసి వచ్చింది. మీకు రాజ్య మక్కర లేకుంటే మాకీ ప్రయాస మెందుకు?

కృష్ణ—మిత్రమా, రాజ్య మక్కర లేనివా డుండునా? కాని అమాత్యుని పేరు చెప్పితే నా కడలు. అతనికి వెయ్యికళ్లున్నవి. రాజుగారివద్ద నెంతచనువుతోనైనా మెలగగలను గాని మాధవాచారి పేరు వింటేనే నాకు తగనిభీతి పుట్టును. ఇంతదూరము మనము వచ్చినా అతని చారులు మనదగ్గర నే ఉంటారనినా కనుమానము లేకపోలేదు.

రుద్ర—ఎంత ధైర్యశాలి! మాధవునికి వేయి కన్నులున్నవనియా బెదరుతూన్నారు? దానరిపిట్టకి (సాలీడు)కూడా చాలాకన్ను లుంటవి, దానిని చూచి జడియుదురు కాబోలు!

కృష్ణ—దాసరిపిట్ట ఈగలమీద దుముకునట్లే హఠాత్తుగా మాధవాచారి మనమీద పడుననే నాకు భయము. మాలిక్ కాఫరు ప్రమేయమే వదలుకొందాము.

రుద్ర—(స్వ)ఇతని కెవరో పిరికిమందు పోసినారు, ఈ బసవన్న బెదిరిపోయినాడు; ఇప్పుడిక లాభము లేదు: ఇతనికి మత్తెక్కించి కార్యము సాధించుకోవలెను. (పైకి) సరే-పోనీ-మీమాట కాదందునా? దేవిగ్నన లాభమే దక్కింది-అది మాత్రము సామాన్యమా?

కృష్ణ—నేను ముందు పోయెదను. నా వెంట నీవు రమ్ము...... (పోవుదురు)

—— ——

## —॥ రెండో రంగము ॥—

(రాజప్రాసాదము—రుద్రదాముడు భీమసింహుడు.)

రుద్ర—ఏమీ! నామాటలు విశ్వసించవా? ఔను-నీబోటి విశ్వాసఘాతకులు అందరూ విశ్వాసఘాతకు లని యెంచడము సహజమే. నీకు నామాట చాలదేమి? వ్రాసి యివ్వవలెనా! (ఆజ్ఞాపత్రమును భీమసింహునిమీద వైచి) ఇదిగో—ఇందు చేవ్రాలు, ముద్ర మొదలైనవి చూచుకో. నీతండ్రి సర్దారుపదవి నీకు రాకుండా చేసినవాడు మాధవాచార్యులు కదా? అది నీకిప్పుడు లభించిం దనడానికి సందేహమున్నదా?

భీమ—నే నే మనగలను? మీరు నానోరు కట్టినారు.

రుద్ర—అట్లు కావద్దు-ఈయాజ్ఞనల్ల నీనోరు మును పటికన్న శక్తివంతమే అవును.

భీమ—నా నాలుక మీయాన జవదాటదు.

రుద్ర—నేను చెప్పేదానికంటె భిన్నముగా అది పల్కెనా దాని నప్పుడే వేయి చీలికలు చేస్తాను. ఇంకో సంగతి-నీ చెయ్యి నీ నాలుకకు బానసై యుండి అదికూడా నా యాజ్ఞానుసారియే కావలెను; ఈవిషయము మరువవద్దు.

భీమ—ఇంతేల? నా సర్వస్వమూ మీకు ధారపోసి నాను,నాజీవితమునకూ కర్తధారులు మీరే కాగలరు.

రుద్ర—సరే. నీవు చేయవలసింది చెప్పుతూన్నాను విను. నిజమైన యుద్ధము కాబోతుంది-దానికి ముందొక టక్కరి యుద్ధము నీవు నడపవలెను. అదెట్లు నిర్వహింతువో నీలో నుంది. (చెవిలో చెప్పి) ఇది తప్పకూడదు సుమా!

భీమ—అమ్మో! తప్పడమే?

రుద్ర—పొద్దు గుంకింది-చండికాలయము వెనుకనున్న మామిడితోట నియమితస్థలము. నా పరాక్రమము చేతనే తనప్రాణము దక్కిందని వీరవిజయుడు నమ్మికొనేటట్లు నీవు యుద్ధమున వర్తించవలెను.

భీమ—ఈ యుద్ధాభాసముతో నాతృప్తి తీరుతుందా? దుష్టుడైన ఆమాధవాచార్యునిప్రాణములు హరించవలెను, నా చేతము సంతసించవలెను. వానిని చిత్రవధ చేసినగాని నాచిత్తమున కానందము కలుగదు.

రుద్ర—బలే! కసియుంటే ఇట్లుండవలెను! రక్తపాతము లేకుంటే నీకు తృప్తియుండదని నే నెరుగుదును. కొంచె మోపిక పట్టితివా ఆ ముచ్చటా తీరుతుంది. ఇక నీవు పో. (వెళ్ళును) ఇట్లే అమాత్యుని మిత్రుల నందరినీ నాలో చేర్చు కొంటాను. నక్కను వేటాడ బోయేటప్పుడే పులి వేటకు కావలసినంత సన్నాహము చేయవలెను. అమాత్యుడన్న మానవులలో పులి వంటివాడే! ఇదిగో అతని బద్ధవైరి రాణి ఇట్లే వస్తూన్నది.

(రాణి వచ్చును)

రాణి—రుద్రదామా! నీ యత్న మెంతవరకూ సాగింది?

రుద్ర—ఫలోన్ముఖమునకు దాపవుతూన్నదమ్మా.

రాణి—సంతోషము. ఏదీ వివరించి చెప్పు

రుద్ర—మాలిక్ కాఫరు సైన్యము రావడమే తడవు.

రాణి—సరేకాని మాకుట కొంతవరకు భయావహము సుమా!

రుద్ర—ఎందుచేత?

రాణి—మా శత్రువుల తుళ్ళడగించడానికి కదా అతనిని మా రాహ్వానిస్తున్నారు. వారిని జయించిన తరువాత అతడు మాపని పట్టునేమో? దిగ్విజయమని పేరుపెట్టుకొని రాజ్యము స్థాపించు కుంటే?

రుద్ర—గుండెయా, చెరువా? మనపట్టణము చేరి

మనతో వైరము పెంచుకొంటాడా? అసంభవము. అదీ కాక, ఆతనికి కావలసింది రాజ్యము కాదు; ఖ్యాతి మొదటిది, ధనము రెండోది, రాజ్యాభిలాష అసలే లేదు. దిగ్విజయము చేయడానికి దక్షిణమునకు పోవునే కాని ఇచ్చట మన ముందు మన్నా ఉండడు.

రాణి—మీకు శత్రువు లున్నారుకదా, వారందర తనితో చేరి మిమ్ము రూపుమాపితే? మాధవాచారి ఏమి కుట్ర పన్నునో?

రుద్ర—మనము రాజ్యవిప్లవము చేయ నమకట్టలేదే? రాజుగారు సింహాసనాధిరూఢులుగా ఉండి, పరిపాలనా చక్రము నడుపుతూందురు. అందరికీ ప్రియుడయిన కృష్ణరాయడు ఇప్పుడు పేరుకే యువరాజుగా నున్నాడు, ఇక ముందు యథార్థముగా ఆపదవియం దుంటాడు. తక్కిన పదవులన్నీ యథాపూర్వముగానే ఉంటవి. ఇక మార్పు చెందేది ఒక్క అమాత్యపదవే కదా! ఇప్పుడది సర్వజనసమ్మతమై ఉన్నదా? లేదే, అట్టిది మారినంత మాత్రాన పట్టణమున కల్లోలము జనించునా? కల్ల.

రాణి—అమాత్యులు మీ రేమి చేయుదలచినారు?

రుద్ర—నా రాపదవిని తక్షణమే మీ పాదకమలములు కర్పించి తీరవలెను. వారి యనంతరగతి వారిచర్యల ననుసరించి యుండును. తన యధికారము విడిచి ఊరకుంటే ఆతనికి సమస్త శుభములూ చేకూరును; అట్లుకాక ఎదిరించితే

అధికారముతో పాటు ఆయువుకూడా అంతరించుతుంది.

రాణి—(నవ్వి) నీ సంగతి ఏమి కానుంది?

రుద్ర—నా భావి మీబోటివారు భరిస్తూ ఉంటే నా కాచింత ఎందుకు? రాజ్యక్షేమమే నా కేకలక్ష్యము, ఇతర చింతలతో పనిలేదు; ఇది దాని కంతరాయములు కారాదు.

రాణి—హంసేశ్వరీ కృష్ణరాయల వివాహ విషయము గర్గాచార్యుల నడిగితివా?

రుద్ర—(స్వ) అబ్బో! ఎంత గడుసుది! మనసులో మాట ఇప్పటికి తేల్చింది. కాని హంసేశ్వరిని కృష్ణరాయనికి దక్కనిత్తునా! (పైకి) అడిగినాను. అది కాజాలదని వారన్నారు, అశాస్త్రీయమావుటే కారణమట.

రాణి—శాస్త్రము మానవ సృష్టియే గదా! దానిని మనమేల అతిక్రమించ రాదు?

రుద్ర—వా రిద్దరూ సపిండులు కావున ఒకరి నొకరు పెండ్లి యాడరాదట!

రాణి—ఆ సంబంధమును మార్చుదాము. రాజకీయ సంస్థ నేర్పాటుచేయడ మత్యావశ్యకము కావున వారిద్దరిలో నొకరి నెవరికైనా దత్తత చేయవచ్చును.

రుద్ర—(స్వ) ఈమె పట్టు గట్టిగా ఉందే! (పైకి) అదీ యోగ్యమయిన ప్రక్రియ! దానిని గూర్చి ఇంకొకప్పుడు సావకాశముగా చర్చింతాము.

రాణి—అలాగే. మీ యత్నముల వివరము ఎప్పటి

కప్పుడు మాకు తెలియజేస్తూండుము. నేను పోయి హంసే శ్వరి మనను త్రిప్పడానికి తగిన ఏర్పాటులు చేస్తాను......

(పోవును)

రుద్ర—ఈమె టక్కరి, తనరొట్టె నేతిలో పడితే చాలునని ఈమె యూహ; మేమంతా మన్నుకొట్టుకొని పో ఫలసిందే! హంసేశ్వరివంటి కన్యారత్నము కృష్ణరాయనివంటి కోతికి దక్కనిత్తునా! ఆరత్నము లేని అమాత్యపదవి నాకేల? కృష్ణరాయ డామెతో కులుకుతూ ఉంటే నే నమాత్యుడనై వాళ్ల అడుగులకు మడుగు లొత్తవలెనా? వైభవము నిచ్చెన వంటిది, దాని నెక్కువా డొక్కొక్క మెట్టు నంటి పో వలెను కాని హటాత్తుగా పైమెట్టునకు పోవడము ప్రమాద కరము. యువరాజపదవి యందీ అవకతవక కృష్ణరాయుని ఇప్పుడు కూర్చుండ బెట్టితే క్రమముగా దానినే కాదు రాజ పదవిని కూడా చేరవచ్చును. వీనిమాట కేమిగాని వీరవిజ యుని మాలో చేర్చవలెను. రాజుగారి ఆజ్ఞానుసారము అతడు చెరసాలలో నుంచ బడినాడు. ఆకార్యము అమాత్యునిపై ఆ రోపిస్తే అతడు మాలో చేరును. అతని సాధించితినా అందరూ నాకు భృత్యులు కాక తప్పదు.



## మూడో రంగము.

---

(చండికాలయము చెంత మామిడితోట-
కాళ్ళూ చేతులూ కట్టా బంధింప
బడిన వీరవిజయుడూ ఇద్దరు భటులు.)

వీర—మీరు నన్నింతదూరమూ నడిపించి ఎక్కడికి తీసుకొని పోతున్నారో చెప్పండి. లేకున్న ఇంకొక్క అడుగు కదలను. నన్నేమిచేయదలచినారో ఇక్కడే కానీయండి.

మొదటి భటుడు—ఇక మీరు నడువ నక్కరలేదు. ఇక్కడివరకూ తెచ్చి మిమ్ము విముక్తం చేయవలెనని మా కాజ్ఞ.

రెండో భటుడు—అయ్యా, మి మ్మిక్కడిదాకా తీసుకొనిరావడమే మాకు ప్రాణగొడ్డముగా నుండి, కాని మే మేమి చేయగలము? తలనము స్త్రకొన్న కాళ్ళ్కడుపు నింపుకోవడానికి యజమాని యాజ్ఞతి దొప్పుని ఇంతకన్న ఎక్కువ దుష్కృత్యములు చేయవలసివచ్చును.

(కట్లు విప్పుదురు)

భటులు—అయ్యా, మీరు ముక్తులు; మాకు సెలవు—

(పోదురు)

వీర—ఎంత దౌర్భాగ్యుడను! యువరాజునయి అధికారము చలాయించుద మనుకొన్న నాడే బందిఖానాలో పడితిని! తలపని తలంపుగా నేడు ముక్తి సంభవించింది, కాని

ఊరి పొలిమేరకు సన్నేల తెచ్చినారో? అంతా అగమ్య గో
చరముగా నుంది. మొదట చెరలో నన్ను పెట్టిన వారెవరు?
ఇప్పుడు విడుదల చేసిన వా రెవ్వరు? ఇందుకు కారణ
మేమి?...నా కేమీ తోచ లేదు. ఇక నే నెటు కదలను?

(గూరువేమయున భీమసింహుడూ విచ్చుకత్తులు
బూనిన భటులూ వత్తురు.)

భీమ—జాగ్రత్త—ఇక్కడుండి కదలవద్దు. కారాగృహ
మునుండి నీకు విడుదల అయినట్లు ఆజ్ఞాపత్రము చూపుము,
లేదా మాకు స్వాధీనుడవు కా. చెరనుండి తప్పించుకొని
ఎట్లు రాగల్గినావు? నిన్ను తిరిగి చెరలో బెట్టవలెనని అమా
త్యులవారి ఆజ్ఞ యిదిగో!

వీర—ఏమీ! ఆమాత్యు డింకా నన్ను తరుముతునే
ఉన్నాడా! ఆతడే మొదట నన్ను చెరలో పెట్టినన్న మాట
నిజమే!

భీమ—అందుకు సందేహమా! నిన్నాతడవమానిం
చడము చూడలేక రుద్రదామునకు నీకు మేలు చేకూర్చవలెనని
రాజుగారి యెదుట పదేపదే నీ సచ్ఛీలము సుగ్గడించగా ఆ
తని ప్రేరణమున మహారాజుగారు నిన్ను విడుదలచేయించి
నారు. ఈకార్య మమాత్యులవారికి సమ్మతము కానందున
నీ వెట్లున్న అట్లు బంధించి చెరలో బెట్టండని మాకు ఆజ్ఞ
నిచ్చినారు. కావున నీవు మాకు లొంగితీరవలెను, లేదా
బలవంతముగా నిన్ను బందిశాలలో పడతోసెదము.

వీర — అయ్యో! ఇప్పట్టున నాచేత నొక ఖడ్గముంటే వీరి బీరము నీరము చేసియుందును కదా!

భీమ — చెరనుండి విముక్తులయిన వీరుల చేతిలో ఖడ్గ ముంచునంత వెఱ్ఱి అధికారుల కింకా సంక్రమింపలేదు. ఊరక లోంగకున్న మావనిని మేము నెరవేర్తుము. (కత్తి దూయగా రుద్ర దాముడు సశస్త్రుడై కొందరు భటులతో వచ్చును.)

రుద్ర — ఆగండి-ఎవరు మీరు? యువరాజు నెక్కడికి తీసుకొని పోతూన్నారు?

భీమ — మేము అమాత్యమాధవాచార్యులవారి బం టులము, మ మ్మడ్డగించు వారెవరు?

రుద్ర — ఓరి పొగరుబోతా! నే నెవడనో గుర్తించితి వా? నాతో వైరము పెంచుకోవద్దు. మీ రీతని విడిచి పోకుం డిరా మిమ్ము మా కరవాలములకు బలివేసెదము. (కత్తులు దూయగానే భీమసింహుడు భటులతో పారిపోవును.)

వీర — రుద్రదామా! నీవు నాకు మహోపకారివి; నీ ఋణ మెట్లు తీర్చగలను? నాప్రాణరక్షణార్థము నీవా ముష్క రుల నెదుర్కొనః నప్పుడు అబలవలె అశక్తుడనై నిలిచితిని! నీవు రాకపోతే వాళ్ళు న న్నీపాటికి నామావశేషు నొనరించి యుందురు.

రుద్ర — వీరవిజయా! నే నొనర్చిన దొక ఘనకార్య మా! ఇ వేటిమాటలు? మన అవస్థలు తారుమారయిన నీ వీపాటి చేసియుండవా? ఇదొక ఋణమా! నీవు దీనిని తీర్చ

యత్నము జేయకున్నా నాకు చింతలేదు. నీవు సజీవుడవయి చెరవిముక్తి చెందినావు, నాకదే పదివేలు!

వీర—కృతజ్ఞుడ నైతిని- నన్ను చెరలో పెట్టిన వారెవరు, కారణమేమి? నా చెరబాపిన వారెవరు?

రుద్ర— హేతువేదో నాకు పూర్తిగా తెలియదు. నిన్ను బంధించడానికి మాధవామాత్యులకుగాక వేరెవరికి ధైర్యము కలదు? మహారాజుగారికి ప్రతిఘటించి నిల్వగల సాహసులింకొకరున్నారా?

వీర—నే ననుమానించినదీ, విన్నదీ పట్టిచూస్తే ఇదంతా ఆతని కుట్ర అనే తోచింది. ఇందువల్ల నేనొక గొప్ప విషయము గ్రహించినాను. పరాక్రమమందు కలము కన్న కరవాలమే బలవత్తరమని అనుకొంటిని, కాని అది కేవల మహోహమని యిప్పుడు తేలింది.

రుద్ర—మిత్రమా, నీవు పొరబడుతున్నావు. అమాత్యులవారు లేఖినిని వ్రాస్తూ అరుదే, అతనిచేత నుండేది కేవల జపమాలే, ఐనా నీబోటి వీరవరేణ్యు నెట్లు ముప్పుల పాలు చేయగల్గినాడో యించుక యోచించితివా? అదేమి పుణ్యమో మహారాజుగారికి కూడా వాగ్బంధ మొనర్పగలిగిందే అమాత్యులవారి ప్రతిభ! యువరాజువు కానున్న నీకే యిట్టి ముప్పు తేగల్గిన వానికి ఇతరు లొక లెక్కా?

వీర—(నిట్టూర్పుతో) నా చేతనున్న కరవాలము కడ్డిపోచపాటి కార్యము నిర్వహింపలేకపోయెనే!

రుద్ర—సరే, మన మీలాగు దంభోక్తు లాడుతూ ఇక్కడ నిలుచుంటే ఏమి ప్రమాదము సంభవించునో?

వీర—నే నిప్పుడు భావి యువరాజునా, లేక చెర నుండి ప్రాణములు దక్కించుకోవడానికి పారిపోయిన అమాత్యుని ఖైదినా? ఈసంగతి నిర్ధారితము కాకుండా ఎక్కడికి పోవడము?

రుద్ర—వీరాగ్రేసరా! నీ కేమిలోటు? నీకు సాధ్యము కాని కార్యమున్నదా? తలతువేని ఇప్పుడే మాధవాచారి యింటికిపోయి ఆతని ప్రాణములు హరింప నుద్యమించితే ని న్నడ్డువాళ్లుండరు. కాని అకార్యకరణము నీ కుపదేశించితినా మిత్రుడ నెట్లౌదును? రమ్మా, మనమిద్దరమూ మిత్రులమై యుందము. నీవయి అమాత్యులవారి కోపము తగ్గిన పిదప అంతా అనుకూలముగానే ఉండును.

వీర—నీవాశ్రయ మిత్తువను ధైర్యము నాకు లేకపో లేదు. నీ విప్పుడు నిర్దేశించినదే నాజీవితాశయము, నా కదే ఏకలక్ష్యమయిన ఆదర్శము; కాని కాలవిలంబన మైతే కార్య ము చెడునేమో? ఆదుష్టుడు నా పరాక్రమము హరించు యత్నమింకొకసారి చేయకమునుపే వానిప్రాణములూ ప్రతి భా నేను హరించడము శ్రేయముకాదా?

రుద్ర—అయ్యా! మీరు కేవల మమాయికులు; మనసులోనిమాట మరుగుచేయరు. కలికాలమున సరళస్వభా వము పనికిరాదు, కపటము లేకున్న కార్యసాధనము కాదు.

వీర—అయితే నన్నిప్పుడేమి చేయుమందువు?

రుద్ర—అమాత్యుడేమి సామాన్యుడనుకొంటివా? నీకూ నాకే కాక ఇంకా ఎందరికో అపకారము చేసి యున్నాడు అట్టివారు కళబద్ధులయి ముందు వెనుక లారసి తగిన యదను చూచి పగసాధించవలెను; కాని, ఎంత వీరుడవైనా నీ వొక్కడవే కార్యము నిర్వహింప బూనడము యుక్తము కాదు-ఎటుపోయి ఎటువచ్చునో కొంచె మాలోచించవలెను.

వీర—వారందరూ పిరికివాళ్ళు-మంది కూడితే మతానికి చేటు-ఒకరౌనని, ఒకరు కాదనీ, ఒకరు యిట్లనీ, ఇకొంక రట్లనీ చర్చించుచూ కాలయాపనము చేయడ మాలోచనీయము కాదు.

రుద్ర—ప్రతిహింసావేశమున నీవు ప్రమత్తుడవు కాగూడదు. అమాత్యుడు జీవించియున్నంత కాలము నీవు రాజవీధిని నడుస్తే మృత్యువు కోరి తెచ్చుకొన్నట్లు కాదా?... రహస్యాలోచనల కిది యుక్తమైన చోటూ కాదు, కాలమూ కాదు. మా యింటికి పోదాము రా!　　　　(పోదురు)



## —నాల్గో రంగము—

(రాజభవనమందు హరదేవరాయుడు)

హర—నే నేమి చేతును? మనసు కుదుట పడదాయె! మాధవామాత్యుడూ నాబోటి ముసలివాడే కదా, అతనిబుద్ధి మాత్రము అస్థిరము కాదా?... కాని అత డెదుట నున్నప్పు డతనిమాటలే ప్రమాణము లని తోచును... రాణి నాదగ్గర నుండునప్పు డామె మాటలే యథార్థము లనిపించును. నా బుద్ధి యింత శిథిలముగా నుంది, మాధవామాత్యుని మానసమూ భ్రాంతమై యిట్లే యుండవలెను... అదే రాణి వస్తూన్నది; ఈమె ముఖసందర్శనము నాకుల్లాసజనక మైనట్లే ఈమె యాలోచనలు కూడా హితకరములని నే నేల తలపరాదు?

(రాణి వచ్చును)

రాణి—నిర్ధారణ చేసుకొన్నారా?

హర—ఏ విషయమున?

రాణి—ఇంతలోనే మరుపా? అయిదారు గడియలైనా కాలేదు, అప్పుడే ఆవృత్తాంతము మరచినారా?

హర—ఏళ్ళు పైబడ్డకొద్దీ జ్ఞాపకశక్తి తగ్గడము సహజమని నీ వెరుగవా? ఇంతభారము తీరినా కొంత మేలని ఎంచుతూన్నాను.

రాణి—మీరు వృద్ధులనీ భూభారనిర్వహణము పూర్ణ

ముగా మీాతలకు మీారినదనే కదా నేను దానిని తగ్గించ యత్నిస్తూన్నాను-కాని నన్నట్లు చేయనివ్వరే!

హర—అట్లందు వేమి? నీసలహా పుచ్చుకోకుండా రాజకీయవిషయములను నేను నిర్వహించ లేదే?

రాణి—మీారు నామాట మీారనిమాట నిజమే కాని అమాత్యశేఖరులు మీా స్వాధీనమున నేమీా ఉంచకున్నారు. వారికి వయఃపరిపాటి తగ్గుతూన్న కొద్దీ అధికారతృష్ణ హెచ్చుతూన్నది. ఆతడే మంత్రి, ఆతడే రాజు అనిపించుతూన్నది!

హర—సమర్థుడగు ఆత డొక వైపునా, నీవు రెండవ వైపునా నాకెంతో సాయము చేస్తూ ఉన్నా, అప్పుడప్పుడు నాకూ ఏదో బరువు తగులుతునే ఉంది-అది మోయడమే నాకు కష్టముగా నుంది.

రాణి—కాలవైపరీత్యము! వయస్సుగతిస్తూ ఉన్నా అమాత్యరాజుగారు అధికారద్వేయ మహిమచేత తిరిగీయువకులవుతూన్నారు; యువకు లగువాళ్లు అధికారనిరాశచేత మనోధైర్యము తగ్గి వృద్ధు లవుతూన్నారు...సరే-ఆప్రసంగ మిప్పుడెందుకు? నాప్రశ్నకు మీా రుత్తర మియ్యనే లేదే! సిద్ధారణాయుందా?

హర—ఏది?

రాణి—మరచినారు కాబోలు-నేనే జ్ఞాపకము చేస్తాను. నే నెవరికీ జంకను...మాధవాచార్యులవారు ముదిమిచేత మీావలెనే మతితప్పినవారు కావడముచేత ఉద్యోగమును

చాలించుకొండని వారితో చెప్పు మన్నాను. ఆలోచిస్తామని మీా రన్నారు...నిర్ధార ణయిందా?

హర—లే...దు, కాని శీఘ్రకాలములోనే నిర్ధారణ చేస్తాను. అదిగో, అమాత్యు లిటే వస్తూన్నట్లుంది-నీవు లోనికి పొమ్ము.

రాణి—(రాజు భుజముపై చేయివేసి) నా కేమి భయము? నే నేల పోవలె? దేవబ్రాహ్మణసమక్షమందు మీా యర్ధాంగము నైనాను కదా, ఆ నాసౌభాగ్యము అందరికీ చూపవద్దా? అప్పుడే కదా నేను ధన్యనౌట?

(మాధవాచార్యులు వచ్చును)

రాణి—అమాత్యరాజా! అంతేనా? నామాట నిజమేనా?

మాధ—మీాపలుకులు నేను వినలేదే!

రాణి—నేను వీరి యర్ధాంగము కానా? శాస్త్ర మేమంటుంది?

మాధ—అదనే దేమిటి? మీాకూ మహారాజుగారికిన్నీ సంబంధ మతిసాంద్రము కావడముచేత శాస్త్రమున కందు చోటేది?

రాణి—అట్లయితే నేను చెప్పేదానిలో సగమేనా వీరు జరుపుతూ ఉండవలెనా?

మాధ—నిస్సందేహముగా - సగమే కాదు.మీారు చెప్పినవన్నీ వారు నిర్వహించినా అక్రమము కాదు-మీారు

చెప్పేది వారి మేలుకే గదా! అదీకాక దార్ఢ్యము తగ్గుతూ న్నప్పుడు రాచకార్యభార మెవరైనా తగ్గింప నెంచితే అది అవశ్యవాంఛనీయమే. నాకూ అట్టి కోరికే కద్దు నావిషయమున.

రాణి—మకుటాధీశుల భారము తగ్గించడానికి నే నేపాటి దానను!...అందున్నూ అల్పవయస్కురాలను, అప్ర బుద్ధురాలను...ఇట్టి నేను శక్తికిమించిన పని నిర్వహించ గలనా?

మాధ—చేయనేరని పని బూనితే చేటు నిజము. కాని యువతులకు దేహదార్ఢ్యము సహజమే కావున దానికి తోడు మనోదార్ఢ్యము కూడా జతపడుతుంది. అందుచేత ఎంత భారమైనా ఎక్కువనిపించదు.

రాణి—ఇదే నిజమైతే నేనొక మాట చెప్పెదను-అ ట్లనువర్తించండని మహారాజుగారికి మీరు బోధించండి-నే నసమర్థురాలనని మీ రూహింతురేమో అని ఏ విషయ మునా ఇదివరకు పట్టు బట్టలేదు.

మాధ—పట్టుదల పూనడానికి మాత్రము మీకు వాక్కులేదా? అదే మక్రమమా? బాల్యమునుండీ మహారాజు గారికి చేదోడువాదోడుగానుండే వాడిని కావున వారి నైజ మెరుగు దును, వారియెడ చనువూ కద్దు; కనుక మహారాజుగా రీపాటి రాజ్యపాలనాచక్రము త్రిప్పడము మాని విశ్రాంతిగైకొని మహా రాణిగారి నావనికి నియోగించడము చేయమనిచెప్పవలెను

శించగలను. అట్లుచేయ నిచ్చ లేకుంటే, వృద్ధుడను గళిత బలుడనూ అయిన నాకు విశ్రాంతి ప్రసాదించి, నాస్థానమందు రాణిగారిని నియమిస్తే నాకు మహోపకారము కావించినవా రౌదురనిమనస్ఫూర్తిగా విన్నవించుకొంటూన్నాను-నేను ఒంటివాడను. ఈపాటి దార్ఢ్య మున్నప్పుడే సన్యాశాశ్రమ స్వీకారమున మోక్షము నొందుటే నా తుదికోర్కె.

హర—(స్వ)అస్ఖలితబ్రహ్మచారియవుటచేత మాధవా చార్యుడు విరాగి కాగల్గెను; నేనో, సంసారసుఖాశ నింకా విడువలేకున్నాను!

రాణి—అమాత్యరాజా! మీాలక్ష్యము కడు ప్రశంస నీయము. ఉభయతారకమైన ఈయుదంతము మహారాజు గారికి తెల్పడానికే కాబోలు మీారిట్లు విచ్చేసితిరి?

మాధ—అమ్మా-మీారు వచించింది సత్యము.

హర—వద్దు, వద్దు, అమాత్యవర్యా! మీారు సన్యసిస్తే నారాజ్యాని కేమి గతి?

రాణి—మహారాజా! మీా రింత దుర్బలు లవు తూన్నారేమి? అమాత్యులవారి యాలోచన ఎంత సమంజస ముగానో ఉంది. మీారు పుణ్యమార్జింపకున్న మానె, ఇత రులు పుణ్యకర్మములు చేయబూనితే వారి నాటంకపరిచె దరా? ఏమి న్యాయమిది? రాజ్యపాలమున కేమి కొరత? ఎవరో ఒకరు దానిని సాగించవచ్చును. అదీకాక ఆ యేర్పాటు మనము చేసుకో తగినది. అమాత్యులవా

రెప్పుడు నేదీ కోరరు. అట్టివారు న్యాయసమ్మతమైన ముచ్చట తీర్పుడని మిమ్ము వేశితే ఈపాటిమేలు చేయకూడదా? అతి ప్రయాసమున ఇంత కాలము రాజ్యశకటము నడిపిన మహాను భావునకు అడుగకుండానే అన్ని కోర్కెలూ తీర్చవలసింది. ముసలివారు కావడముచేత పాప మోపిక లేదు. ఇప్పటి కైనా విశ్రాంతి వారి కొసగకూడదా?

మాధ——రాణిగారి మాట నిజము. ప్రవాహమూ కాలమున్నూ ఒకరికై వేచియుండనట్లు రాజ్యపాలనమూ ఒకరికై నిలిచియుండదు. నేను సన్యసించడము మానినా——

రాణి——ఇంతలోనే మీసంకల్పము మారినదా ఏమి?

మాధ——మహారాణీ, మీరు భయపడ నక్కరలేదు. నా సంకల్పము మారేది కాదు. ఒక వేళ రాజ్యక్షేమము కొరకు నేను సన్యసించడము మానినా, అమరుడను కాను కదా? నేను గతించిన పిమ్మటనైనా రాజకార్యభారము ఇతరులపై పడవలసిందే! మానవుడు సర్వకార్యములూ తనవల్లనే నిర్వహింపబడుతూన్నవని ఎంచుకొన్నా, అతని మరణము వల్ల లోకాని కేలోటూ ఉండదు, అది ఎప్పటివలెనే దృఢముగా నిలిచి ఉంటుంది; ఎందరికైనా చావుంది గాని దానికి లేదు. ఎట్టి మహానుభావుడు మరణించినా ఈజగము వాని వైపు వంగి వాలదు, ఇంచుకేని చింతింపదు? దానిదారి నది అనర్గళముగా జరుగుతూ ఉండును. నాకిక సెలవు దయ చేయండి.

హార—అమాత్యా, మీరు సన్యసించడము నిజమేనా? అట్లైన నాకుకూడా సన్యాస మిప్పించండి.

రాణి—మీరు రిట్లనగూడునా? భార్య సమ్మతించకుంటే సన్యసించ గూడదు. ఏమి అమాత్యశేఖరా?

మాధ—మీ రెరుగని శాస్త్ర మున్నదా?

హార—అన్నా! వార్ధకమున పెళ్లి చేసుకుంటే తిక్కైన చిక్కులకన్న ఇది గొప్పచిక్కే.

రాణి—నే నంత భారమైతే నేనే ఉసురుల బాసెదనులెండి. మీరు నాభయముచేత సన్యసించ నక్కర యుండదు. మీరు సన్యసించడానికి నాసమ్మతి కావలెను కాని నేను చావడాని కెవరిసెలవూ అక్కరలేదు. (పోవును)

హార—చూచితిరా అమాత్యవర్యా, నా పాట్లు? వివాహ మొక గట్టి సంకెల! బ్రహ్మచారి కున్న పాటి స్వాతంత్ర్యము గృహస్థుకి లేదు. అందూ రాజైనవానికి స్వేచ్ఛ మొదలే లేదు. ఈ పదవి నొందదలచినవా ళ్ళితరసౌఖ్యము లెన్నిటినో కోల్పోవలసి యుండును.

అమా—గతమునకు చింతించిన ఫలమేమి? రాణిగారి మానసము ప్రసన్నము చేసుకొంటే మీ కన్ని చింతలూ పోవును. పసిబాల మాటలు నేను పాటిసేయను. మీ రామెను శాంతింప చేయండి; ఆమె ఎంతకైనా సాహసురాలు!

(పోవుదురు)

---

—॥ ఐదోరంగము ॥—

(మీనాక్షి ఇంటిదగ్గర హానుమ)

హాను—ఈ మీనాక్షియింటికి వచ్చినవెంటనే నా శ్రమ అంతా తీరిపోవును. ఇది అపవిత్రకులసంభూత అని అందరూ గర్హింతురు, వారి జోలి నాకేల? వారిమాట నేను పాటించువాడను కాను. శీలవతి ఏకులముదైన నేమి? సుక్షత్రియవంశసంజాత యని మహారాణిగారి నందరూ గౌరవించుతూంటారు కాని గుణసంపద నామె దీనికి సాటి రాగలదా? నాకు దీనియందు గల గౌరవమూ అనురాగమూ పక్షపాతపూరితములే అనుకొందాము; మహాత్ముడైన మంత్రిగారికి దీనియెడ గలిగిన వాత్సల్యము నేమనవలెను? ఈ పట్టణమందున్న వారిలో హంసేశ్వరి తరువాత మీనాక్షే కదా వారి కాదరపాత్రము? అతడు మూర్ఖుడని ఎంచగలమా? అదిగో అమాత్యులవారికొరకు చిత్రాసన మల్లుతూ లోలోన ఏదో గొణుగుకొంటూన్నది.

మీనా—గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః॥

(కంజాక్షి వచ్చును)

హాను—అయ్యో! ఈ గయ్యాళి, ఈ పరమలోభి నా దురదృష్టవశముచేత ఇక్కడ దాపురించిందే! ఇప్పుడు బయల్పడక మరుగున పొంచియుండడమే మంచిది.

కంజా—ఇంకా చిత్రాసనమే అల్లుతూన్నావా? ఓసీ పెద్దమ్మా! చీకటి పడ్డాది, సింగారించుకో వేమి? ఈపాళంగా కోటలోనుండి కబురు వస్తే ఏమి సమాధాన మిస్తావు?

మీనా—గానని చెప్పుతాను.

కంజా—ఈకొంప కూల్చడానికే నీవు పుట్టినావు! ఇదేమి పంతమే, జెట్టా? ఎన్ని జన్మము లెత్తి ఎంత పుణ్యము చేసుకొంటే రాజాశ్రయ మబ్బుతుంది? అట్టి తపఃఫలము తారసిల్లి నప్పుడు తప్పుకొనే మూర్ఖు లుందురా?

మీనా—ఎన్నో జన్మాలనుండి చేసిన పాపము పండడముచేతనే పడుపుకూడు తినే జన్మము ప్రాప్తించింది? ఇంక మీదనైనా పశ్చాత్తాపపడి పాపపరిహారార్థము శ్రీగురుచరణారవిందములు సేవిస్తే ఉత్తరగతు లుంటవి.

కంజా—ఓసీ మొద్దా! శ్రీమంతుడైన రాజు నాశ్రయము పాపమున్నా, గర్భదరిద్రుడైన మానుమను పట్టుకొని పాకులాడడము పుణ్యమనీ భావిస్తూన్నావా?

మీనా—సందేహ మేమి? ఫలాపేక్ష లేనిప్రేమ ప్రశంసనీయము కాదా? ధనము లభిస్తుందని దేవురించుతూన్నావు కాని ముసలితొక్కు—మీరా మోహ మున్నదే? ఆతని ముఖచంద్రు డగుపడిన వెంటనే మన నేత్రరాజీవములు మూసుకోవటే? మానుము కంటపడితే నా కానందాబ్ధి నోలలాడినట్లుంటుంది. సహజమైన ఇట్టిప్రేమ వీడి కృత్రిమప్రేమ నెంతకాలము నటించుచుందును?

కంజా—వినాశకాలము వచ్చినప్పు డిట్టి విపరీతబుద్ధులే పుట్టుతూండును. నీజన్మ మిట్లే జరిగిపోతుంది...(వెళ్లును)

(హనుమ వచ్చును)

హను—మీనాక్షీ, పరుల ప్రసంగము పొంచియుండి విన్నవాడి కేమి శిక్ష?

మీనా—(నవ్వుతూ) నే నేమి శాస్త్రము చదువుకొన్నానా?...అట్టివాళ్ళని వాళ్ళ మనస్సే కొంతవరకూ క్షోభపెట్టుతుంది.

హను—ఆలా గనకు. అట్టి పనిచేసినవాళ్ళు తామేదో మహాత్కార్యము చేసినామని యెంచుకోవడమే కాక దాని గూర్చి బడాయి కొట్టుకోవడము కూడా కద్దు.

మీనా—నా అక్కకూ నాకూ జరిగిన ప్రసంగమితనిచెవిని పడ్డదేమో! (ప్ర) ఆకస్మికముగా అట్టి ప్రసంగము వినబడితే అందు దోషముండదు.

హను—కావచ్చును, కాని నేను రెండుసారులు బుద్ధిపూర్వకముగానే ఆ నేరము చేసినాను. అందువల్ల నాకు చాలా లాభమే కలిగింది! మీఅక్కకీ నీకూ జరిగిన ప్రసంగము విన్నాను—నీ ప్రేమోక్తులు నన్ను ధన్యుని చేసినవి.

మీనా—అటులనా? రెండపరాధము లంటిరి, ఇక్కడి వలెనే వేరొకరి ప్రేమోక్తులు వింటిరి కాబోలు! అదే నిజమైతే నేను మీ రిల్లు వెడలిన వేళ మంచిదే!

హను—అనుమానపడకు-ఇవి ప్రేమోక్తులు, నాకు

చెందినవి-అవి ద్వేషోక్తులు, మన ప్రభువుకి చెందినవి.

మీనా—ఆ ద్వేషోక్తులు మిమ్మెట్లు ధన్యుని చేసినవి?

హను—వాటిని వినడమువల్ల ప్రభువువారికి కొంత వర కుపచరించవచ్చును కదా అనే సంతసము నన్ను ధన్యుని చేసింది. ఒక్కసారి ఈరెండు సంభాషణలూ వినడముచేత నీవన్నట్లు నేను బయలుదేరిన వేళ మంచిదే.

మీనా—ఆసంభాషణ ఎట్టిదో నేను వినవచ్చునా? లేక రహస్యమా?

హను—నీవు వినగూడని రహస్యము నా కుంటునా?

మీనా—అ దేమన్న మాట! పురుషుల కెన్నో రహస్యము లుండును, అందున్నూ అది ప్రభువువారి విషయ మని మొదటే చెప్పినారు. రాజకీయ వ్యవహారములకు సం బంధించిన విషయములు రాములకు చెప్పకూడునా?

హను—ఆవిషయము అమాత్యులవారికి చెందినది, ...వారి యాంతరంగికులలోని దానవు కావున నీవు తప్ప కుండా వినవలసిందే. అది చెప్పడానికే నేను వచ్చినాను. ఆచార్యులవారి యనుమతిపైని రుద్రదాసు కృష్ణదేవరాయలను కనిపెట్టుతూ నేను చంద్రికాలయము చేరి, అక్కడ దాగుండి వారి రహస్యాలోచనలు విన్నాను.

మీనా—విశేషము లేమి?

హను—విజయనగరసామ్రాజ్యము వశపర్చుకోవలెనని వాళ్ళ ప్రయత్నము.

మీనా—ఏమిటీ? వా ళ్ళేమి చేయనెంచినారు?

హను—బెదరకు. రాజ్యము గైకోవలెనని బందుకట్టు చేసినంతనే అవుతుందా? తాము చేతకానివారమని తెలిసి మాలిక్ కాఫరు సహాయమును కోరదలచి రుద్రదాము డతనికి జాబువ్రాసి కృష్ణరాయుని దానిపై సంతకము చేయుమని నిర్బంధించుతూన్నారు.

మీనా—ఆ వివేకశూన్యుని సంతకమా?

హను—వివేకవంతు లట్టివారి మూలానే తమకార్యములు నిర్వహించుకుంటూ ఉంటారు...అదటుండనీ-ఈ కార్యమున నీవూ కొంత సాయము చేయవలెను.

మీనా—నా చే తేమగును?

హను—ఈకుట్రలో రాణిగారూ చేరి యుంటారని నా నమ్మకము. అంతఃపుర మంతటా నీవు తిరిగుతూ ఉంటావు కనుక—

మీనా—ఇచ్చటి భోగట్టా మీకు తెలియజేస్తాను.

హను—ఆవార్త నెరిగి అమాత్యులవారి దగ్గరకు రా. గురువులవారి సేవ నేను నాకు ప్రాప్తించడానికి సుయోగము లభించింది. వా రచిరకాలముననే సన్యసింప నిశ్చయించినారని హంసేశ్వరితో చెప్పు.

మీనా—హంసేశ్వరి అంటే జ్ఞప్తి వచ్చింది. రాజప్రాసాదమందెల్లా ఆమె ఒక్కర్తే మానవజాతిలోనిది, తదితరు లందరూ పశువులూ పిశాచములూ రాక్షసులూ అన

వచ్చును. అమె పంచప్రాణములూ వీరవిజయునియం దుంచిం ది, పాప మాతడు చెరలో నున్నాడు.

హను—సన్యసించడానికి ముందు అతనిచెర బాపవలె నని గురువుగారు తలంచినారు కాబోలు. ఓరుగంటి కారా ధికారికి వారు వ్రాసియిచ్చిన రహస్యాజ్ఞ నే నందిచ్చి వచ్చి నాను.

మీనా—అట్లు జరిగితే వాళ్ళ రేఖ బయలుపడ్డదన్న మాటే.

హను—ఇక నేను పోయి వస్తాను. (నిష్క్రమించును)

మీనా—నేనూ రాజనగరమున కిప్పుడే పయనిస్తాను. అక్కా! అక్కా! (ఆమె వచ్చును) నేను రాజనగరుకి పోవ లెను-నన్ను త్వరగా అలంకరించు.

కంజా—ఇందాకానే ఈ బుద్ధి పుట్టలేదేమి? శ్రీరంగ నీతు లివ్వా డేమయినవి? ఈమార్పునకు హేతువేమి? పిలుపు రాలేదే!

మీనా—పోనిత్తూ! వినోదము కోస మట్లన్నాను కాని కులవృత్తి మానుకొందు నటే! రోజూ పోవలసినదానికి పిలుపు రానేల?

కంజా—రా, నిన్ను ముస్తాబు చేస్తాను. (పోవుదురు)



## —⁘ ఆ రో ర ం గ ము ⁘—

(మాధవామాత్యుని హోమశాలలో అమాత్యుడు హంసేశ్వరి)

హంసే—నాన్నగారూ! నాన్నగారూ! ఇదేమి, ఇట్టి పని తలపెట్టినారు! ఇకముందు నేను "నాన్నా" అని ఎవరిని పిలుతును?

మాధ—ఎవరది? అమ్మా హంసేశ్వరీ! ఏమన్నావు?

హంసే—ఇక నా కెవరు దిక్కు? న న్నెవరి కప్పగించుతారు?

మాధ—ఏమమ్మా! ఆలాగు నిరాశ చెందుతూన్నావు!

హంసే—నేటివరకూ నన్ను కన్నతండ్రిలాగు పెంచి, కన్నతల్లివలె ప్రేమజూపి నా కేలోపమూ లేకుండా పెద్ద జేసితిరి ..ఇంప్పుడు...(ఏడ్చును)

మాధ—అదేమమ్మా, కన్నీరోడ్చుతూన్నావు?

హంసే—ఇప్పు డా సుఖ మంతా నన్ను విడిచి పోవునని-

మాధ—ఎందుచేత?

హంసే—మీరు సన్యసించుటకు నిశ్చయించిన ట్లిప్పుడే విన్నాను. అదే నిజమైతే ఇక నాకు తల్లి యెవరు తండ్రి యెవరు? "రా, అమ్మా, హంసేశ్వరీ" అని నన్నిక పిల్చువా ళ్ళెవరు? నన్ను వాత్సల్యముతో చేరదీసేవా రెవ్వరు!

మాధ—ఈమాట నీ కెవరు చెప్పినారమ్మా?...ఒక వేళ నిజ మనుకో, నీవు వ్యసనపడెద వేల? రా, బిడ్డా, ఇక్కడ

కూర్చుండుము. నేను సన్యసిస్తే నేమి ప్రమాదము? రాజ దర్బారులో మంత్రినైనా ఇంటివద్ద సన్యాసినే కదా? సన్యాసాశ్రమము ప్రత్యక్షముగా స్వీకరించినంత మాత్రమున ప్రమాద మేమి సంభవించగలదు? నా దేశమాతయందుకాని ధర్మపుత్రికవగు నీయందుకాని ప్రేమ తగ్గు ననుకొంటున్నావా? వెఱ్ఱిదానా, నీ వింకా చిన్నదానవు-సన్యాసదీక్ష మా బ్రాహ్మణులకు సహజమైనా, సంసారసంబంధమైన సాత్విక మాయాపాశములనుండి సన్యాసికి కూడా విముక్తి ఉండకూడదని నీ వెరుగవు-బ్రహ్మచారినైనా గృహస్థునికివలె నా కిద్దరు బంధువు లున్నారనినీ వెరుగవా? మొదటిది విజయనగర రాజ్యలక్ష్మి, రెండవదానవు నీవు. అవివాహితుడనైనా ఎడతెగని వాత్సల్యరసపూరితుడనై ఉన్నాను కాదే?

హంసే—అటులైన మీరు సన్యసించి శృంగేరికి పోయేటప్పుడు నన్ను మీవెంట తీసుకొని పోవుదురా?

మాధ—నే నక్కడికి పోవుదునని కూడా తెలిసిందా?

హంసే—ఇప్పుడు కృతులచేత జగద్గురువు లైనారు; ఇక ముందు మఠాధికారముచేత జగద్గురువులు కాబోతున్నారని కూడా తెలిసింది.

మాధ—ఇంతా తెలిసీ, వెఱ్ఱిదానా, సంతోషించక సంతపించుతున్నావేమి? నీ భావిజీవితము సుఖముగా గడచుటకు తగిన ఏర్పాటులు చేయకుండా ఇక్కడనుండి వెళ్ళిపోవుదు ననుకొంటున్నావా? సన్యాసదీక్ష నాకెంత ఆవశ్యకమో నిన్ను

సంసారములో ప్రవేశపెట్టడము కూడా అంత ఆవశ్యకమే. కావున సిగ్గుపడక నీ మనసులో నున్నమాట నాతో చెప్పు. నీ వెవరిని పెళ్లియాడ నిశ్చయించినావు? నీకు తల్లినైనా తండ్రినైనా నేనే కదా? నీ యోగక్షేమములారయు భారము నాదే కావున నాదగ్గర దాచక నిజము చెప్పు.

హంసే—బాగుంది-మీకన్న నాకెక్కువ తెలుసునా? ప్రసంగము మార్చవలెనని ఏదో దెసను వెతకినట్లు తోచు తూన్నది.

మాధ—యోగ్యుడైన వరునికి నిన్ను దానముచేసిన గాని సన్న్యాసాశ్రమమును స్వీకరించడానికి నా కధికారము కలుగదు. విజయనగర రాజ్యమూ నీవూ అబలలే, కావున మీ సుఖముగురించి సమానబాధ్యత వహించడము నాకు విధి. రాజ్యలక్ష్మిని నేను స్థాపించితిని కావున ఆమె నా కన్న కూతురు . .

హంసే—మరి నేనో?

మాధ—నీవు నా పెంపుడు కూతురవు.

హంసే—అంతేనా?

మాధ—తొందర పడకు. నామాట సాంతముగా గ్రహించకే మాటలాడెద వేమి? "కన్న ప్రేమకన్న పెంచిన ప్రేమ పెద్ద" అని ఎరుగవా? కావున నీవు పూర్వగణ్యావు-

హంసే—తప్పుమన్నించండి-మీరు సన్న్యసిస్తారని విన గానే నాకు పట్టరాని కోపమూ దుఃఖమూ వచ్చినవి.

మాధ—నీకోసమిపశమింప చేయగలను...దాని కేమి గాని, నా ప్రశ్న కుత్తర మివ్వవా; నీ ప్రేయసు డెవడు?

హంసే—(ఊరకుండును)

మాధ—ఏమి మాటాడవు?...ఆఁ, తెలిసింది...నేనే మరచినాను. మహారాజగు హరదేవరాయులు నిన్ను ప్రేమిస్తూన్నారని నేను వింటిని-ఆతనికన్న ఉత్తము డీ రాజ్యమున లేడు. అతని నీవు ప్రేమించినట్లైతే ధన్యవే-మహారాణివి కావలెనని నీ కుందా? నీ అంగీకారమే తడవు; వివాహ సన్నాహ మతి శీఘ్రకాలములో చేయించగలను. నాకుగల రాజభక్తి రాణింపజేసే కానుకగా నొక కన్యారత్నమును వారి కర్పింది నా సేవ ధన్యము చేసుకొంటాను-అత్యుత్తమ పదవి లభించినందుకు రత్నమూ, అట్టి రత్నము లభించినందుకు రాజుగారున్నూ భాసిల్లుదురు; యోగ్యమైన సంబంధము సంధానపరచినందుకు నేనూ సంతోషిస్తాను.

హంసే—(ఎర్రబారి) నాయం దెంతో మక్కువ ఉన్న దంటూ మీ రాజభక్తికి నన్నాహుతి చేయడము మీకు తగునా? నాదినముల వంకరకొద్దీ మీ కిట్టిబుద్ధి పుట్టింది! రాణి పదవి అబ్బినందుకు సంతసించడమే మిగులుతుంది కాని ఇతర సుఖములు నున్న కదా? కాటికి కాలు చాచినవానిని కట్టుకొనడముకంటె కత్తితో మెడ కోసుకోవడము మేలు-పెళ్ళియాడడము పదవి కోసమా? అధికారలుబ్ధు లట్లు చేయుదురే, కాని అన్యుల కది రుచించునా? రాజున్నంతకాలమే

కదా రాణీవైభవము! ఆవెన్క ఆమెగతి ఏమి? "గోరుచుట్టు పైని రోకలిపోట" న్నట్లు మీరీలాగు పలకడము భావ్యమా?

మాధ—ఏమో అధికారమూ వైభవమూ స్త్రీల కత్యంత ప్రీతిజనకములని అట్లన్నాను; నీ కిష్టములేదని నే నెరుగను. నీ అధికార నిస్పృహ కెంతో సంతసిస్తూన్నాను... నిజమే-కేవల పదవీ అధికారమూ వధూవరు లీడుజోడుగా నుండకుంటే అంతగా ఆనందజనకములు కావు...దీనిని మర చిపో-ఇక రాజాస్థానముందున్నవా రెవరైనా నీమనస్సుకి నచ్చి నారా? ధైర్యశౌర్యగాంభీర్యాది గుణసంపన్నులైన యువకులు దర్బారులో చాలామంది ఉన్నారు, అట్టివారిలో నొకని నెన్ను కోవడ మక్రమము కాదు; నీవు స్వాతంత్ర్యప్రియవు పేదవా నియింట దీనతచేతనూ భాగ్యశాలియింట ఐశ్వర్యాతిరేకము చేతనూ పరాధీనత ఘటిల్లుతుంది. ఈ రెండూ వదలి ఒకసర్దా రుని చేపట్టితివా కొంత ఐశ్వర్యముతో బాటు కొంత స్వాతం త్ర్య మబ్బగలదు. ఇదీ నంచి ఆలోచనే!...ప్రస్తుతరాజసర్దా రులలో నధికుడు, రుద్రదాముడు-అతడు నిరంకుశధైర్యశాలి, పౌరుషవంతుడైన వర్ధిష్ణువు, మహారాజుగారికి కూర్చిన బంధు వు, మిత్రుడు- అతనికి నిన్నిమ్మని నన్నడుగదలచినారు రాజు గారని నేను విన్నాను. నీకిది సమ్మతమైతే నా అవశిష్ట మా వంతా లేదు.

హంసే—నా హృదయమునకు శూలాయమానమైన ఇట్టి ప్రసంగము చేయవద్దని ప్రార్థిస్తూన్నాను. మీకు నచ్చిన

5

ముఖ్యులు నాకు నచ్చకపోవడము నా దౌర్భాగ్యమే!

మాధ—అట్లైతే వానిని గురించి ప్రశంస చేయను... కన్యాదానమే నా పని-ప్రాజ్ఞురాలవు కావున పాత్రనిర్ణయము నీది. రాజుగారూ, రుద్రదాముడూ నీ ప్రేమకు పాత్రులు కాకుంటే వేరెవ్వరున్నారు?...ఆ-మరచినాను. నీకుతగిన రాజబంధు వింకొక డున్నాడు...అతడు సుందరుడు, సకలగుణసంపన్నుడు—కాని...అతని నీవు పెండ్లియాడడము రాజదంపతులకు గిట్టదు కదా అని సంశయిస్తూన్నాను.

హంసే—నా వివాహవిషయమున పెత్తనము వారికెవరిచ్చినారు? వారి మతామతములతో నా కేమిపని? మీకు నచ్చితే నాకు సరి.

మాధ—ఇంకో అడ్డున్నది-అతని అవస్థ యిందుకు ప్రతికూలముగా నుంది.

హంసే—మీరు న్యాయపరులనీ గుణపక్షపాతులనీ దయాశాలురనీ ఖ్యాతి దశదిశలా వ్యాపించియుంది. మీ కటాక్ష ముంటే ప్రతికూల పరిస్థితు లనుకూలముగా క్షణములో మారుతవి. మీరు న్యాయము విమర్శించితిరా—

మాధ—వీరవిజయుని మాట నేనంటూన్నది—నీ యూహ వేరొకరీతి నున్నట్లుంది.

హంసే—లేదు— వారిమాటే నే నన్నది.

మాధ—ఇక నేమి?...అతడు...నీ కనురూపుడే కాని

హంసే—నాన్నగారూ, నాదొక మనవి. క్షమిస్తే

చెప్పుతాను. ఆ పురుషసింహుని స్వభావమునకు తగిన ఆదరణ మీ రాతనికి ప్రసాదించలేము. అదీ నా గ్రహచారమే.

మాధ—అమ్మా, అతనియెడ నేను విముఖుడననే కదా నీ అభిప్రాయము?...ఇంతవరకు నీతో వినోదముగా కాలక్షేపమొనర్చుతున్నాను, కాని మీ పరస్పరానురాగము నే నెరుగక పోలేదు, ఆతడు గుణశాలి అనీ ఎరుగుదును; దేశభక్తిపూరితుడైన వీరశేఖరుడు-మన దేశములను క్షోభపెట్టు శత్రుసేనలను దునుమాడజాలు బంటు ఆతడొక్కడే! కాని ప్రస్తుత రాజకీయపరిస్థితు లాతనికి ప్రతికూలము లనుమాట మరువగూడదు. ఇందుకు తోడాతడు సరళమనస్కుడు, చలచిత్తుడు, ప్రపంచవివేకము కొంచెము తక్కువ.

హంసే—సరే, లోపము లేని మానవు డుండబోడు. అందున్నా నిర్వాహకుడైన రాజపుత్రుడు యువకుడైతే అతనియందు లోపము లుండకుండునా?-అట్టివాని కింకొకరు బాసటైతే ఆ లోటు పూటు కాదా?

మాధ—నిజమే కాని, అతడు నాయెడ ప్రతికూలుడే!

హంసే—శివశివా! క్షమించండి. ఇందు మీరు భ్రమబడుతూన్నారు. మీరు సత్వగుణపరిపూర్ణులు, ఐనా వారియెడ మాత్రము—

మాధ—ఓసి వెర్రిదానా, నేను భ్రాంతుడనని ఎంచుతూన్నావా? లేదు, లేదు, పొరపాటు వీరవిజయునిది. ఈర్ష్యావేశులైన రాజబంధువుల ప్రేరణచేత మహారాజుగా రతనిని

పెట్టిన పాట్లన్నీ నాపై నారోపించి శత్రుభావము వహించి యున్నాడు! నాపొడ ఆతనికి కిట్టకున్నది. అట్టివానికి నిన్నిచ్చుటకు నేను సమ్మతించినా సాధ్యమయినంత శీఘ్రముగా నన్నంతమొందించి తన జీవితము నిష్కంటకము చేసితీరడ మతనికి సహజము.

హంసే—నేను తనను చేరినపిమ్మట ఆ వ్యామోహాలు మార్చజాలనా? పంకిలమైన నీటిలో పటిక వేస్తే అది నిర్మలము కాదా?

మాధ—కావచ్చును, కాని ఇంకో అంతరాయమున్నది. అతడిప్పుడు మహారాజుగారి స్వాధీనములో నున్నాడు. ఒకవేళ చెరతప్పినా అతనిప్రాణములు రాజుగారిచేతిలో నున్నవి. పాముపడగ నున్న మాణిక్యము ప్రాప్తించుటెట్లు?... లేకుంటే నిన్నాతనికిచ్చి నేను నిశ్చింతుడనై యుందును.

(ఆత్రముతో హనుమ వచ్చును.)

ఏమి విశేషములు?

హను—(రహస్యముగా) వీరవిజయుడు డీయూరు చేరినాడు.

మాధ—తల్లీ, అగ్నిహోత్రము నుపాసించు సమయమైనది, పోదాము రా.

హంసే—చిత్తము-పూజాద్రవ్యములు సిద్ధపరుస్తాను.



## —॥ ఏడో రంగము ॥—

(అమాత్యాచార్యుని ఆశ్రమమెదుట శాంభట్టు-
మిళింబాచార్యుడు)

శాంభ—రండి, రండి

మిళిం—అమాత్యుల దర్శన మిప్పుడు కాదా?

శాంభ—ఇది జపసమయము-అది ముగియక పూర్వ మెవరినీ చూడరు—లక్షాధికారైనా సరే భిక్షుకుడైనా సరే.

మిళిం—అట్లైతే అంతవరకూ ఇక్కడ కూర్చుందాము. వీరి మహాలు చూడవలెనని కోర్కె యున్నది. అంతా చూపెదరా?

శాంభ—చూపడానికేము౦ది? ఇదే వారి మహాలు.

మిళిం—పోనీ-వారి సభాభవన మెక్కడ?

శాంభ—ఇదే వారి సభాభవనము.

మిళిం—వారు రాజకార్యములు తీర్చు చావడి ఎక్కడుంది?

శాంభ—వా రిప్పుడు జపము చేస్తూన్నచోటే వారి కచేరి. మహారాజుగారు దర్శనమునకు వచ్చినా ఇక్కడే వారికి స్వాగత మొసంగుచుందురు.

మిళిం—చిత్రముగా నుంది! ఇక్కడ హోమశాల తప్ప వేరేమీ లేదు.

శాంభ—ఇందే వారు సదా కాలక్షేపము చేస్తూం

దురు. ఆకోవెల గర్భాలయములో సంధ్యవార్చి మధ్యాహ్న మీహోమశాలకు వచ్చి, శిలాసనముపైని కూర్చుండి దేవతా రాధన చేసి, రెండుమూడు కందమూలములు భుజించి, చిన్న కమండలవుతో పా లారగిస్తారు. పిదప ఆ వేత్రాసనముపైని కొంచెము సేపు విశ్రమించి కృష్ణాజినము మీాద కూర్చుండి, ఒకయామము రాజ్యవ్యవహారములు నిర్వహింతురు. అటుపైని సాయంత్రము దాకా ఈ చతుష్పీఠముపై గ్రంథ లేఖనము కావించి, సంధ్య వార్చి, దేవాలయమున మంత్రపుష్పము సమర్పించి, ఈహోమశాలకు దయచేయుదురు. రాత్రులు ఫలాహారమునా మమాత్రమాచరించి,రహస్యాలోచనలయందు కాలము పుచ్చి, పన్నెండుగడియల రాత్రివరకూ జపముచేసి, నిద్ర పోవుదురు.

మిళిం—త్రికాలమూ వారక్లే జరుగుతూందురా?

శాంభ—ఇదే వారి దినచర్య, చలి ఎక్కువగా నుంటే హోమకుండము దగ్గరనే కార్యక్రమము జరుపుతారు.

మిళిం—వారి పరివార మెంత?

శాంభ—పరివారమా?-ఒక కూతురు, ఇద్దరు—

మిళిం—మీా గురువుగారు బ్రహ్మచారులని వినికి, వారికి కూతు రెట్లు కలిగెను?

శాంభ—కన్నకూతురు గాదు-పోష్యపుత్రిక క్షత్రియ కన్య! ఆమె నతిగారాబమున పెంచుతూన్నారు. వారి దినవ్య యమునకు మహారాజుగారు తగిన ఏర్పాటులు కావించినారు.

న - గురు సేవకులున్నారు, గురువుగారికి పరిచర్య ఒనర్చడానికి కాదు, వారికూతురిని కనిపెట్టుకొని యుండడమునకే-గురువుగారికి ఒకరు సేవచేయు నక్కరలేదు. వారొక కాషైనా అంటరు.

మిళిం——గురి శిష్యు లెంతమంది?

శాంభ——ఇద్దరము-నేనూ హనుమా.

మిళి——వారి సన్నిధానమున ఎప్పుడూ ఉండేవారెవ్వరు?

శాంభ——నేను. వారిని కనిపెట్టుకొని ఉండేవాడనూ వారి కత్యంతప్రియుడనూ నేనే

మిళిం——ఇతను జంభాలరాయుడు, కొంచెము పొగ పెట్టితే వీని వాగ్యంత్ర మదేపనిగా తిరుగుతూంటుంది——(ప్ర) ఈ మాట చెప్ప నక్కరలేదు. ముఖము చూడగానే మీరు ప్రియశిష్యులని విశద మవుతూన్నది. మీరు గురువుగారి కత్యంతప్రియు లెట్లయినారు?

శాంభ——మొదటి కారణము, నే నుత్తమబ్రాహ్మణుడను, హనుమ శూద్రుడు. అహర్నిశా లెడతెగకుండా గురువుగారి సన్నిధిని నే నుండును-హనుమ వారు చెప్పినదే చేస్తూండును, నా కా నియమము లేదు-గురువుగారు వాని కెప్పుడో కాని పని చెప్పరు. వానియం దంత ప్రేమా లేదు. వారి శాటీలు నేనే ఉతుకుతాను, అసన మమరుస్తాను, హోమాని కావలసినవి నేనే అందిస్తాను. వారి జపసంఖ్య పద్దు నేనే

వ్రాస్తాను. గ్రంథపఠనమూ, లేఖనమూ, నేను లేకపోతే జరుగ నేజరుగవు-రహస్యాలోచనలలో కూడా గురువుగా రప్పుడప్పుడు నాసలహా పుచ్చుకొందురు.

మిళిం—మీరు గురువుగారి బహిఃప్రాణ మన్నమాట! మిమ్ముచూస్తే వారి దర్శనము సగ మైనట్లే.

శాంభ—చిత్తము.

మిళిం—జపసమాప్తి యైనదేమో చూచి వస్తారా?

శాంభ—అట్లే. (పోవును)

మిళిం—ఆహా! దక్షిణాపథమందు హిందూసామ్రాజ్యముస్థాపించి, దాని కాధార స్తంభుడై, విద్యాపోషి భారతవర్షమున కధీశుడై, రాజ్యపాలనా నిపుణుడైన అమాత్యమాధవాచార్యు డీచిట్టిగుడిసెలో కాపురము చేస్తూన్నాడా! సరస్వతీదేవికి కంఠాభరణుడు, సకలవిద్యాసాగరుడు, వేదవేదాంగపారంగతుడు, సర్వజ్ఞశిఖామణియు నైన మాధవాచార్యు డీయాశ్రమమున కూర్చుండి గ్రంథరచన చేస్తూండునా?... భళీ! ఏమి నిస్పృహ! ఏమి స్వార్థపరాఙ్ముఖత! ఈ హోమశాలయు నఖండవైరాగ్య సూచకములైన పరికరములే కాన్పిస్తూన్నవి. ఈవేత్రాసనమూ,కృష్ణాజినమూ,నారి కేళకమండలువు,హోమభస్మమూసంసారపరాఙ్ముఖునకు పరమార్థ సాధనములు కావే!ఒకవంక,రాజవైభవమూ,ఇంకొకవంకపరమహంసవైభవమూ, ఆహా ఈ నగరము వ్యావహారిక పారమార్థిక కాదర్శముల నభ్యసింపచేసి, జనుల కిహపరసౌఖ్యసంపదలు ప్రత్యేకు

మొనర్చుతూన్నది! "దూరపుకొండలు నునుపం" మా?, కాని ఈసామ్రాజ్యమును గూర్చి నేను విన్నది కన్నదానికన్న పది వేలరెట్లు తక్కువ-ధర్మసామ్రాజ్యపట్టాభిషిక్తులైన శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులవారి సన్నిధి చెప్పుడూ ఉండు నాకే కల్పనాతీతమైన వైరాగ్యదర్శనము చూపగల ఈ మాధవాచార్యులు జగద్గురువులు కాగల రనడమున కావంతైనా సంశయము లేదు. కావుననే సర్వజ్ఞులైన శృంగేరిస్వాములవారికి మాధవాచార్యులవారిని యోగరాజ్యపట్టాభిషిక్తులు చేయు ప్రవృత్తి కల్గింది. కాగలయర్థము లిట్లే పురస్సూచనలు చేస్తూంటును.

---

—•• ఎనిమిదో గర్భాంకము ••—

---

(మాధవాచార్యుని హోమశాల)

మాధ——ఊఁ తెలిసింది-మానసా! తురక కీచకులు నన్ను హాయిగా సన్యసించ నిచ్చారు...కృష్ణరాయ అగ్రహారములు యవనసర్దారు నాశ్రయమున మానపట్టణములకు ఘాతరయినర్ప నెంచినారా?

మాన——వారి యత్నము లిట్లే ఉన్నవి.

మాధ——కానీ, వారి పాపకార్యములకు తగిన ఫలమనుభవిస్తారు. వారు నాగురించి ఏమనినో చెప్పు.

మాన——వారి కారుకూతలు నే నుచ్చరించలేను స్వామీ!

మాధ— రాజ్యతంత్రము చేబూనినవాళ్ళు తమ్ముల దుష్టు లేరీతి నిందిస్తూందురో వినుట కెల్లప్పుడూ సిద్ధులై ఉండవలెను. అధికారమదము సన్నంటనట్లు లోక నిందా నన్ను బాధింపజాలక నీ వెరుగవా? వినడానికే కదా చెవులు ప్రసాదింపబడ్డవి-నిరంతరాయముగా వాటిధర్మము వాని నిర్వహించ వలసినదే. నసరుబోతూ మూర్ఖుడూ నైన కృష్ణరాయుల నోటినుండీ, గృహనాశకుడైన రుద్రదాసు నోటినుండీ వెడలిన పలుకులు నన్ను వినసీ.

హను—నా చెవులకే అవి ముళ్ళులు; ఐనా, వినక తప్పింది కాదు. రుద్రదాసుడూ,—

మాధ—సంకోచము వద్దు-శత్రువు మాటలు కదా అవి.

హను—"మన మొగ్గిన ఈ బందుకట్టు బోనులో మాధవుడను వరడు చిక్కక తప్పదు" అనెను.

మాధ—కుంటనక్క కన్న వరడు ఎక్కువ జిత్తుల మారి అని మూర్ఖు లెరుగరు. బోను తయారౌను కానీ, అందె వరు పడతారో తెలుస్తుంది- ఈ కుట్రకు నాయకు డెవరు?

హను—కృష్ణరాయుడు.

మాధ—ఐతే ఇది మదుపు లేని వ్యవహారమని ఎరుగరు కాబోలు! వారి పన్నుగడలన్నీ గాలితో కట్టిన మేడలు కృష్ణరాయుని సామ్రాజ్యమున కాలచక్రము వక్రగతిని పట్టే నే కాని సరిగా నడుచునా?

హను—ఆతని పెత్తనము పేరుకే. ఈ కపటనాటకానికి సూత్రధారి రుద్రదాముడే.

మాధ.—అది నిజమే. మహారాజుగారి ఎదుట మధుర వాక్యములాడి అతనిని వశపరచుకొన్నాడు. అధికారులు స్తోత్రప్రియులు గనుక వారియాటలు సాగినవి. మాగధుల మాటలు మత్తెక్కించి తీరును.

హను:—ఇంకొకటి—కృష్ణరాయుడు యువరాజవునట. ఆతనికి హంసేశ్వరి నిమ్మని రాజుగారు మిక్కిలి నెదలచి నారని కూడా విన్నాను.

మాధ—ఇది క్రొత్తవార్త కాదు. కృష్ణరాయుడీ యూశ వదలుకోవడ ముత్తమము. వానికి తగిన వధువు ఊరి తాండే! వీరు తన్నుతూడన్న కుచక్రము ఆ వివాహసన్నాహ ములలో నొకటి. కృష్ణరాయరుద్రదాములను బోలు ద్రోహు లనూ జనకంటకులనూ నిర్మూలము చేయకుండ నేను సన్యాస దీక్ష వహించడము యోగ్యము కాదు. నీవు పోయి రేవు కూడా వారిజాడ కనిపెట్టుచుండుము. బైటనున్న చారుని పంపు. (అతడు పోవును)

(చారుడు వచ్చును)

ఏమి వార్తలు?

చార:—నిన్నరాత్రి యువరాజుతోట మండపమువద్ద నలుగురు రేకాంత మాడుకొన్నారు. "మాధవాచార్యుని రేపు నిశీథమున యమపురికి పంపడము నిశ్చయ" మని ఒకడనగా

"అట్టి దుస్సాధ్యమైన పని జరుగడ మేలా" గని రెండవ వాడు ప్రశ్న వేసెను. అందుకు—"మనకా వివరముతో పని లేదు, రుద్రదాసుడా సంధానము చేయగల" డని మూడవ వా డన్నాడు. "రాత్రి పదిగడియలకు తోటద్వారముకడకు రావడమేమన పని, అది మనము చేతాము-అనంతరకర్తవ్య మప్పుడే తెలియగల"నని నాల్గవవా డనెను.

మాధ—సరే, నీవు పోవచ్చును-(వాడు పోవును) ఈ నలుగురూ సులభముగానే వలలో పడతారు-

(మీనాక్షి వచ్చును)

మీనాక్షీ, నీ కేమైనా వార్త తేగల్గినావా?

మీనా—మహాత్మా, రిక్తులై గురువులను చూడ పోవచ్చునా? చిత్తగించండి- రాజనగరున ఏదో మహోత్పాతము జరుగుతూన్న ట్లుంది-కృష్ణరాయనికి కేమితోచక పుట్టెనో కాని నన్ను చేర పిలిచి రహస్యమును మనస్సులో దాచగలవాడూ, మరణించునప్పుడైనా మనసులోమాట బయటపడనియ్యని వాడూ, ధైర్యస్థైర్యములు కలవాడూ, లోభియూనై నమ్మకమైన వీరభటుని నీవెరుగుదువా?" అని పలుమారు నన్ను నిర్బంధించి అడిగెను. "ఉన్నాడ"ని నే నన్నాను-వెంటనే "వానికి రహస్యమూ, అతిప్రమాదజనకము నైన పని తా నొప్పగింతుమనిన్నీ, దాని నతడు జయప్రదముగా నిర్వహిస్తే మాయిద్దరికీ గొప్ప బహుమతి యిచ్చెదమ"నీ చెప్పినాడు.

మాధ—రహస్య మారవ చెవిని పడకూడదంటారు. అందున్నా ఆడదానినోట నుఖ్వగింజ నానదు. తాను తల పెట్టిన కార్య మెట్టిది? దానిని నీకు తెల్పవచ్చునా?...ఇందే వాని వివేకము తేటపడింది. ఇట్టివాడు రాజద్రోహులు నాయకుడట! భళిరే! పిన్నాట నీ వే మన్నావు!

మీనా—"నా సోదరునికి మాకు చెప్పిన లక్షణము లన్నీ పట్టిన వ"న్నాను-తరువాత ఆత్మాతంగ యుతో "రేపు రాత్రి పదిగడియలకు లోహాకవచము, పొడవుటంగీ తాల్చి, శస్త్రధరుడై, గుర్రమెక్కి తన తోటద్వారముకడ వాడు వేచి యుండవలె"నని చెప్పు మన్నాడు.

అమా—కాని మీనాక్షీ, తెలివైనదానవు కదా—లేని సోదరుడున్నా డంటివే, వారు నమ్మినారా?

మీనా—మహాత్మా-ఆలోచించియే అట్లు చెప్పితిని-సోదరుడు కొకరువాడున్నాడన్న అట్టివాని నసలే నమ్మరు-ఎన్ను తమకుట్రలో చేర్చుకొన్నారు గనుక నా మాట వారికి విశ్వసనీయమే-ఆతురుల కాలోచన యుండదు; వారికి కావలసినవాడు-రాతు. అట్టివా డున్నాడని చెప్పగానే పరమానందభరితుడై నందున పై చర్చ చేయుడాని కతనికి బుద్ధిపుట్టనే లేదు.

మాధ—సెబాసు, మీనాక్షీ! మానవస్వభావపరిశీల నమున ఆరితేరిన మీరు రాజకార్యములందుం దత్యంతోప యోగులు-చూచితివా నీపాటి బుద్ధిసూక్ష్మత మహారాజు

గారికి లేకపోయింది? తనమేలు, రాజ్యక్షేమమున్నూ చేకూర్చు కొనే ప్రజ్ఞ అతనికి లేకపోయింది-సరే, నీవెంట నేనెవనిని పంపుతానో వాడే ఈవిషయమున నీకు సోదరుడవును. నీవు పో. (ఆమెపోవును)

(సేనాధిపతి వచ్చును)

సేనా—(కరవాలము ముందుపెట్టి) అమాత్యరాజా! ఈ శస్త్రము నేమిచేయవలెనో సెలవివ్వండి.

మాధ—సేనాధిపా, మీ ఆవేశము చూస్తే ఈశస్త్రము మీదో మహాపరాధము చేసినట్లుంది; దాని నెరుగకపోతే శిక్ష విధించడ మేలాగు?

సేనా—అపరాధము చెప్పు మన్నారా? సామాన్యాపరాధము కాదు-అది తలుచుకొంటే దీని నిక ధరించడము మాని ముక్కలుచెక్కలు చేసి పారవేయవలె ననిపిస్తుంది-

మాధ—ఓరుగంటి సమరములో నిరుపమాన శత్రు సంహారము మీ కొనర్చింది దీనితోనే కదా?

సేనా—చిత్తము.

మాధ—వేటలో మీ యుసురులు కాపాడిన దిదే కదా?

సేనా—ఔను.

మాధ—ఆనెగొంది ముట్టడిలో మహారాజుగారి ప్రాణమూ మానమూ కాపాడిన దిదే కదా?

సేనా—అట్టి మహాప్రతాపము చూపింది గనుకనే

ఇక నిది ఉండరాదు.

మాధ—మీ ఆత్మగౌరవము మెచ్చుకోన దగినదే, కాని కత్తిని శిక్షింపనేల? దానిపై మీకింతాగ్రహ మేల?

సేనా—అమాత్యరాజా! అవధారు, నిన్న నేను మహారాజుగారి దర్శనమునకు పోగా రాణిగారు చిరునవ్వుతో యువరాజపదవి ఎవరి కివ్వవలెనని ప్రశ్నించినారు.

మాధ—రాజాస్థానమున మహారాణిగారి చిరునవ్వు వెన్నెల కాచే రోజులా ఇవి! మీ రేమని జవా బిచ్చినారు?

సేనా—నిజము చెప్పితే నిష్ఠురమనిన్నీ మహారాణిగారి మనస్సు నొచ్చుననీ ఎంచి మొదట నేనేమీ అనలేదు.

మాధ—వీరుల స్వభావము ఒకటే వేటు, రెండు తునకలు-అంటారు; దూరాలోచనపరులు గనుక మీరు తటపటాయించినారు-ఆమె మిమ్ము సుళువుగా వదలియుండదే!

సేనా—అబ్బో! మీకా రాజద్రోహి వీరవిజయుడు యువరాజు కావలెనని ఉండి-అందుచేతనే నీళ్ళు నములుతూ నిరుత్తరులయినారని నన్నెత్తిపొడిచింది.

మాధ—రాణిగారంత స్పష్టముగా చెప్పినప్పుడు మీరు ఓ నన్నారా?

సేనా—ఆమె నన్ను భ్రమపెట్టి నాగుట్టు రట్టుచేయవలెనని తలచింది కాని నేను లొంగలేదు.

మాధ—బలే! వీరవ్యవహారము వెనుక బెట్టి రాజనీతి నైపుణి మీ రెప్పటినుండి అభ్యసిస్తూన్నారు?

సేనా—ఏమి నేర్చిన నేమి ఫలము? ఆమె అంతటితో నన్ను వదలిందా?

మాధ—ఆమె సోదరునకి యువరాజపదవి నొసగడము గూర్చి స్పష్టముగా మిమ్ము ప్రశ్నించలేదా?

సేనా—ఆతురపడువా రాగుడు గా? అని ప్రశ్నించింది.

మాధ—భ్రాతృత్వము సార్థకమైనదని ఆమె సంతసించిందా?

సేనా—అంతే కాదు-తమవిజయము వెల్లడిచేయ నెంచి, ఉత్సాహముచేత మైమరచి నా రాజభక్తిని నిరసించి నన్ను తూలనాడి, అంతతో నాగక నా కరవాలమును కాలితో తన్నింది!

మాధ—అట్లు చేసినందువల్ల అపరాధము రాణిగారిది కాని, కత్తేమి చేసింది?

సేనా—తన్నిన కాలు తక్షణమే తుత్తునియలు చేయకుండా ఊరకుంది- రాణియైన నేమి? నా రాజభక్తిని నిరసించితే నేను సహించవలెనా? నన్నూ నా కరవాలమునూ అవమానించవలసినంత నేరము మేమేమి చేసినాము? ముసలివానిగని పెళ్లియాడింది కావున అతని నెత్తెక్కి పీడించనీ. రాజసేవకుల నూరక తూలనాడవచ్చునా?

మాధ—మీమాట సత్యము. మిమ్ము తూలనాడినందుకు రాణిగారు పశ్చాత్తాప పడుతారు. వారిమీద కోపముచేత మీరు మీఖడ్గమును ఖండించుట కేవల మనవసరము-

దానితో నికముందు చాలా పనియున్నది. ఏక్షణమున తురకలో లేక శత్రురాజులో మనపై దాడియూదుతారో మనకు తెలియదు కదా? అప్పుడు మీ స్వామిభక్తి చూపడానికిది గొప్పసాధన మవును కదా? నోరు వాయి లేని దానిపై మీకు కోప ముండజనునా?

సేనా.—విశ్వసనీయులూ పరాక్రమవంతులూ ఐన వీర భటుల నిట్లవమానించడమే సదాచారమైతే, ఇక కొలువులో ప్రఖ్యాతపురుషు లుండరాదు-మీ మొగము చూచి ఆగవలెనేకాని రాజదంపతులను తలచుకొంటే ఈకొలువుకి తిలోదక మర్పించవలసిందే...నా కిక సెలవు. (పోవును)

మాధ—రాణిగారిపై ఫిర్యాదు చేయనివారే లేరు. మహారాజుగారు రెండో వివాహముకు సమ్మతించడమే గొప్ప అవశకునము. ఈ విషవల్లి కెట్టి ఫలములైనా పుట్టగలవు. సరిగపావడాతో ఆమె రాజసభకు విచ్చేస్తూఉంటే "పగలు ముగిసి, రాత్రి ప్రారంభమయిందని" సూచించు గుడ్లగూబ రెక్కలు చేసే ధ్వని వినిపిస్తూంటుంది. ఈమె ఆనరా చూచుకొనే కదా ఈమె సోదరుడు రాజద్రోహియై కుట్రలు పన్నుతూన్నాడు. యవనసేనానికి వీళ్ళంపిన ఉత్తరము నాచేత పడిందా వీళ్ళకి తగినశాస్తి కాగలదు.






# రెండో అంకము

## — । మొదటి రంగము । —

(కృష్ణరాయని మహలు)

**మీనా**—నే నాస్థానవేశ్యను. రాజ్యము వంశపరంపరాగతమైనట్లే మాసేవయూ వంశపరంపరాగతమే. ఈయాచారముప్రకారమే మా అక్క వీరదేవరాయలవారి కుంపుడుకత్తె, నేను యువరాజుకు చెందవలసినదానను. ఆపదవి ఎవరికి లభిస్తే వారే నాకు ప్రభువులు, కావున అది రుద్రదామునిదా, కృష్ణరాయనిదా, లేక ఇంకొకనిదా అను ప్రమేయము నా కనవసరము. పూలదండ కేల కీలించి యువరాజునని నా ఎదుట ఎవరు నిలుస్తే వారికంఠమున దానిని వైచి, వారియెడ లేనిప్రేమ గన్పరచి, వారి లాలసాగ్నికి యావజ్జీవ మాహుతి కావడమే నావిధి! ఆహా! ఎంత యసంగతము? ప్రేమ యిట్టి నిబంధనలకు లోబడుతుందా? నిర్దిష్ట పురుషులయందు నిక్షిప్తము కాదగినదా ప్రేమ? అయ్యో! సానిపుట్టుకెంత హేయము ప్రేమను నడిబజారున అమ్మవలెనా? ఛీఛీ!

ఇంతకన్న నీచతరమైన కార్య మున్నదా? ధనము నాశించి ఒక పురుషునికి వశురాల నగుటయే నీచము. అందున్నా మనసుకి నచ్చనివానికి లొంగియుండడ మతినీచము... కానీ, యువరా జెవరో ఏర్పాటు కానీ-వాని కీదేహ మమ్మకుండా దానినే బలిగా నొసంగి రాజులకూ సేవకులకూ తగిన బుద్ధి గరపుతాను. వేశ్యలు సాధారణముగా పెదవికంటిన తాంబూలరసము తుడుచుకోవడమునకు చిన్న పట్టుచేరుమాలు నడుమున ధరించుతారు. దానికి మారుగా నేనొక కఠారి నుంచుకొని నామానము హరింప దలచిన యువరాజు గుండెలో గుచ్చెదను. పిమ్మట ఏమైనా సరే... ఆ వచ్చేవారెవరు? ఓహో కృష్ణరాయలవారా? భావియువరాజవతంసమా? ఆహా! ఏమి వేషము! ఏమి ఠీవి! విజయనగర రాజకులమున కీతడు దిష్టిబొమ్మ! ఇతడే నా భావిసరసుడు, యజమాని, యమదూత... రానీ రానీ, వీనికి కాస్త గుగ్గిలముపొగ వేసి కుచక్రము భోగట్టా సంగ్రహిస్తాను. (ముందుకు పోయి నమస్కరించును)

(కృష్ణరాయలు వచ్చును)

కృష్ణ—ఎవరిది! మీనాక్షీ!

మీనా—చిత్తము, తమ చరణదాసినే.

కృష్ణ—నీ వీ సమయమున ఇచ్చట వచ్చినావు!

మీనా—మీ దర్శనముకే వచ్చినాను. మీ రిక యువరాజు కాబోతూన్నారని విని, సంతోషము చేతచూడ వచ్చినాను.

కృష్ణ—(మీనసముదుప్వి)రహస్యము నీకెట్లు తెలిసింది.

మీనా—బాగు బాగు! ఊరంతా మోగుతూంటేనే. ప్రభూ, ఇంతే కాదు. మాలిక్ కాఫరను యవన సేనాని మీఖ్యాతివిని పరాక్రమమునకు వెరచి వచ్చినదారిని పోతూం డగా ఆతని దౌర్జన్యమునకు మీా రాగ్రహించి తక్షణమే రమ్మని తాఖీదు పంపినారట!

కృష్ణ—ఔను—నే నెంతో అనుమానించినాను కాని రుద్రదాముడు బలిమిని అందుమీద నాసంతకము చేయించు కొన్నాడు. సంతకమే కదా, ఒకటి కాకుంటే పది సంతకములు చేస్తానని అన్నాను. ఏమి భాగ్యము?

మీనా—ఔను-మన కేమి నష్టము? చిక్కైనా సంభవిస్తే సంతకము నేను చేయలేదని బొంకి తప్పించుకో వచ్చును. ఒకవేళ మీాసంతకమే అని స్థిరపడ్డా మి మ్మెవ రే మన గలరు? మీా అక్కగారు మహారాణి, మీారు భావియువ రాజుగారు! ఈ సామ్రాజ్యము నిర్మూలము చేయడానికి కూడా మీా కధికారమున్నది.

కృష్ణ—సందేహ మేమి? నేను రాణిగారి సోదరుడను.

మీనా—అదే నేనన్నది. తలచుకుంటే రాజ కుటుంబమును నాశనము చేయడానికి రాణిగారికీ అధికార ముంది.

(రాణియు హంసేశ్వరియూ వత్తురు)

రాణి—సోదరా! ఏమిచేస్తున్నావు? ఒహో, మీనాక్షి

చెంతనే ఉన్నదా?

మీనా—దేవీ, యువరాజుగారి పరివారము లోని దానను, వారి చెంతనే కదా నే నుండవలసినది.

రాణి—హంసేశ్వరీ, చూచినావా? నా సోదరు డెట్టి వాడో-ఎప్పుడూ ఆనందసాగరమందు ఈదుతూ ఉంటాడు. రేపు నిన్నాతనికి పెళ్ళి చేసినతిమ్మట వాని నెరుగగలవు.

హంసే—ఇట్టి ప్రసంగము కొరకా న న్నిక్కడి కీడ్చు కొని వచ్చినారు? ఇది నాకు శిరోభారమని మీ రెరుగరా?

మీనా—ఇక్కడికి రాకపూర్వము నాకూ తలనొప్పి ఉండేది, కాని యువరాజుగారితో రెండుమాటలాడుసరికి అది పోయింది!

రాణి—సరే—కృష్ణా, నీవే స్వయముగా ఈ హంసే శ్వరిని బుజ్జగించు- నీ కది భార్య కాగలదు.

మీనా—ఇక నామె బాధ తీరగలదు.

రాణి—మీనాక్షీ! కృష్ణరాయునికీ హంసేశ్వరికీ జోడు కుదిరిందా?

మీనా—ఈ నాటక మింతతో ముగించవలెను, లే కున్న హంసేశ్వరికి బాధావిముక్తి కాదు. (ప్ర) దేవీ, భార్యాభర్తల నొక్కదగ్గర నుంచకపోతే మీ రడిగిన ప్రశ్న కుత్తరమివ్వలేను.

రాణి—నిజమే. కృష్ణా, ఏదీ హంసేశ్వరి పక్కనిలబడు.

హంసే—ఈ పరిహాసము చాలును—నే నిదే మహ

రాజుగారి వద్దకు పోయి ఈవృత్తాంతము వారికి తెలుపుతాను. (త్వరగా పోవును)

రాణి—చూచినావా మీనాక్షీ, దీనికెంత పొడుకో?

కృష్ణ—అక్కా! నేను దాని కొప్పుపట్టి ఈడ్చుకొని వత్తునా? నాభార్య ఇట్లు చేస్తే న న్నడ్డేవా రెవ్వరు?

మీనా—ఓహో! శృతి మించుతూన్నది. నే నిక నూరకుంటే పాపము హంసేశ్వరికి కష్టమవుతుంది. (ప్ర) దేవర వారు శ్రమ పడనేల? నే నామెను బుజ్జగించి తీసుకొని వస్తాను. (పోవును)

రాణి—తమ్ముడా, రుద్రదాముడు నీకు జాబు చూపినాడా? అందులో ప్రమాదజనకములైన విషయములు లేవుకదా?

కృష్ణ—చూపినాడు-నేను దానిని చదువకే సంతకము చేసినాను. ప్రతికాగితమూ చదువడానికి నాకు పొద్దు చాలుతుందా? అందుచేత అది తేగానే సంతకము జేసినాను.

రాణి—కాగితము చూడకుండా అట్లు చేయవచ్చునా?

కృష్ణ—ప్రతికాగితమూ చదవడానికి నే నేమి గుమాస్తానా? యువరాజును కానా?

రాణి—సరిపోయింది.ఎట్లైనా ఆజాబు చూచి తీరవలెను. అం దేమి ప్రమాద ముందో? (పోవును.)



## —॥ రెండో రంగము ॥—

(రాజుగారి మహాలులో మీనాక్షీ హంసేశ్వరి.)

మీనా—రాకుమారీ, ఊరడిల్లు.

హంసే—నాకు మాత్రము ఏడ్పున్న సుఖ మను కొన్నావా?

మీనా—నీ దుఃఖహేతు వేది? నేను దుఃఖము వాపెద నని కాదు. ఇతరులకు ఎఱిగిస్తే దాని ఆవేగము కొంత తగ్గుతుంది.

హంసే—రాణిగారు చేసినది నీవు చూచినావు కదా?

మీనా—దానికి నీవు చింతింపనేల? రాణిగారన్న నీ కోలెక్కా? ఇందాకా నీవు చేసినట్లు ఇక రెండుసార్లు చేస్తే వారిక నీజోలికి రారు.

హంసే—ఈరీతి నామె బాధస్తూంటే న న్నెవరు కాపాడుతారు? రాజభవనమందు నన్ను రక్షించేవాళ్లే లేరు.

మీనా—ఇదా నీదుఃఖహేతువు! ఇంకేదో మహాత్కా రణ ముం దనుకొన్నాను. ఈ మాత్రపుదానికంత చింతించ వలెనా? అంబారి నెక్కినవాళ్ళు, గుఱ్ఱము నెక్కినవాళ్ళనీ, గుఱ్ఱపురౌతులు పాదచారులనూ చూడవలెను.

హంసే—ఎందుకు?

మీనా—వాళ్ళదుఃఖము సుఖముగా మారుతుంది.

హంసే—నాకట్టి సాంత్వన మేలాగు కలుగుతుంది?

మీనా——నీకు తల్లిదండ్రులు లేని లోటుందికాదా?

హంసే——ఆ విషయమున నాకన్న నికృష్టవతి ఉండదు.

మీనా——కన్న తలిదండ్రులు లేనివాళ్ళకు భగవంతుడేదో సదుపాయమును చూపించి తీరును. నీవిషయము చూడు-నిన్ను హరదేవరాయలవారి కప్పగించ లేదా? నా కాపాటి ఆధారమైనా ఉందా?

హంసే——మహారాజుగారికినామీద వాత్సల్య ముండేది రెండో పెళ్ళి అయినప్పటినుండీ ఆపట్టూ విడిపోయింది

మీనా——ఇప్పుడైనా ప్రేమ బొత్తిగా నశించలెదు... అమాత్యరాజుగారిమాట ఎత్తనే లేదేమి నీవు?

హంసే——ఆయన నన్ను కూతురువలె భావిస్తూన్నారన్నమాట నిజమే కాని అదీ అంతమయ్యే సమయ మాసన్నమైంది-నాన్నగారు సన్యసిస్తారని నీవేగా చెప్పినావు? వారాలాగు చేసిన తరువాత నేను దిక్కులేని పక్షి నౌదును కదా?

మీనా——నిన్నిచిక్కులో పెట్టి వారు సన్యసిస్తా రనే బెంగ వద్దు-అన్నీ విడదీసి ఆశ్రమము స్వీకరిస్తారు.

హంసే——నా దినములు వంకరైనప్పుడు వారు మాత్రమేమి చేయుగలరు? రాజుగారూ రాణిగారూ నాపాలికి శకట్లములా గున్నారు!

మీనా——రా కుమారీ-నీవు వట్టి బేలవు. మంత్రిగారొక్కరూ తోసిరాజు చేయుగలరు, వారి ప్రభావ మహిమ

నీవు తెలుసుకోలేకున్నావు. నిన్ను తగినవాని కిచ్చి ఉద్వాహ మొనర్చక ఈయూరు దాటి అడుగైన కదలరు; నామాట నిజము.

హంసే—బందిఖానాలో ఉరితీయుడానికి మండపము లుంటవి కాని వివాహమండపము లుండవే? అది తలచుకొన్న పుడు నాకు "గోరుచుట్టుపైని రోకలిపోటు" లా గుంటుంది.

మీనా—నీకు బాధాకరముగా ఉంటుందని ఎరిగే నేనా ప్రశంస తెచ్చినాను- వీరవిజయులకు కారావిముక్తి అయిందని నీ వెరుగవా?

హంసే—నిజమే? నీ కెవరు చెప్పినారు?

మీనా—ఎవరు చెప్పితే నేమి? ఇది పరమ రహస్యము—మీ కచిరకాలముననే వివాహము కాగలదు. అమాత్యరాజుగారు నిన్నొకసారి రమ్మని చెప్పుమన్నారు- వారి నిష్ఠాసమయము గనుక ఇంతసేవూ నేను చెప్పలేదు.

హంసే—నీవు చెప్పకున్నా నే నక్కడికి పోవాలనే అనుకొంటున్నాను- రాణిగారు నన్ను పెట్టిన రవ్వ వారితో చెప్పవలెను- మనమిద్దరమూ పోదాము రా.

మీనా—అమ్మయ్యో! నీవెంటా నేను రావచ్చునా?

హంసే—ఎందుచేత?

మీనా—లోకులు నిన్నే మందురు? . . నేను వేశ్యను, మీ వెంటనుంటే మేలిమిబంగారువంటి మీ ప్రతిష్ఠకు కల్మష మంటిన ట్లగును. చలువచేసిన బట్టకు చమురుమరకా?

మీరొంటిగా పోవలెను.

హంసే—లోకులు కాకులు, వాళ్ళకి తోచినరీతిని కూస్తారు—దానిని నేను లెక్క చేయను...అదీకాక-నీవు వేశ్య వైనా నిన్ను దూషించేవాళ్ళ నోట పురుగులు పడి తీరుతవి. ఈ రాజనగరంతా వెదకినా నీఖోటి శుద్ధశీల దొరకదు; ఈ యూళ్లోనైనా ఉందురో లేరో! ఈరాణిగా రిచ్చటికి తెంచిన తరువాత శీలవిప్లవము సంభవించింది...మీనాక్షీ—నీవూ నేనూ దిక్కులేని వాళ్ళమే, మనకిద్దరికీ దుఃఖము సమానము కనుక మనకు సఖ్యము సహజము. అమాత్యరాజుగారి కిద్దర మూ సుతప్రాయులము. నీ మంచిచెడ్డలు నావి, నా సుఖదుః ఖములు నీవిగా భావించు కొందాము— పద ఆశ్రమమునకు— నీతో కలిసి ఉన్నందుకు నన్నెవ్వరుదూషించినా నాకు పరమ సంతోషము-కులముతో నేమి పని; గుణము ప్రధానము— రా, పోదాము.

---

—॥ మా డో రం గ ము ॥—

---

( అమాత్యుని హోమశాల. )

మాధ—ప్రశాంతమైన ఈ నిశీథమున ఏమోకాని నాచిత్తముకు శాంతి లేకుండా ఉన్నది. పరిపరివిధముల శంకలు పుట్టి క్షోభపెట్టుతూన్నవి...ఔను. రాజ్యవ్యవహార ములలో తలదూర్చి తత్సంబధములైన చింతలూ కామములూ

వాటిల్లరాదని కోరడము భావ్యమా? అది యెన్నటికైనా ఈడేరునా? కర్మ వ్యావహారికమూ ఐహికమూ అయినప్పుడు తత్ఫల మట్టిదే అవును. ఒకప్రక్క మంత్రిత్వము, ఒకపక్క సన్యాసము ఈ విషమ వ్యాపార సంఘట్టమే చిత్తక్షోభకు కారణము. ఈరవ్వంత ఉపాధీ త్యజించి బ్రహ్మానందప్రవాహమున నా ప్రాణము లను నావ నడుపవలెను. ఐహిక సుఖము నపేక్షించను కావున నాకు మృత్యుభీతి లేదు; చిరతరాభ్యస్తములు కావడముచేత రాజభక్తి దేశభక్తి యందలి వ్యామోహము విడువవలెనని ఎంత యత్నించినా అవి విడువకున్నవి. చిత్తము బ్రహ్మానందపదవి నోలలాడవలె ననుకొన్నా గాలిపటమును తంతువువలె రాజభక్తి నన్ని సంసారమును విడిచి పోనీకున్నది.

(హనుమ వచ్చును)

ఇదిగో, వీడిని చూడగానే సంసారములో ప్రవేశించక తీరదు... ఏదీ, ఆ రాజద్రోహి జాబు? దానిపైనే ఈ విజయనగరము యోగక్షేమము లాధారపడి యున్నవి.

హను—స్వామీ, నా సందేహమే సత్య మయింది! ప్రాణపదమైన జాబు పరులపా లయింది; నిష్ప్రాణమైన ఈ గాత్రము నిరర్థకము, కావున ఈ కృపాణముతో దీని నుత్తరించుకోవడానికి నాకనుమతి నొసగండి.

మాధ—వ్యర్థప్రలాప మెందుకు? ఉత్తర మేది?

హను—క్షమించండి. అది నా చేతినుండిజారిపోయినది.

మాధ—ఏలాగు జారింది? ఏ మయింది? వాళ్ళు నిన్ను నమ్మలేదా? ఆ జా బనలే నీ కివ్వలేదా?

హను—రుద్రదాముడే అది నా కిచ్చినాడు.

మాధ—దాని నెక్క డుంచినావు?

హను—ప్రభూ, మీ యాజ్ఞానువర్తినై తోటద్వారము చెంత చేరినాను. పదిగడియల రాత్రికి బందుకట్టువాళ్ళందరూ అక్కడికి వచ్చినారు. మాధవాచార్యుని బ్రతుకు నేటితో సరిఅని పరస్పరమూ అభినందించుకొన్నారు. అంతట కృష్ణరాయలూ రుద్రదాముడూ వచ్చిరి. రుద్రదాముడు నన్నెన్నో ప్రశ్నలు వేయగా మారుస్వరముతో మితముగా జవాబు లిచ్చితిని, అప్పటికీ అతని సందేహము తీరనేలేదు. కాని కృష్ణరాయని ప్రోత్సాహముచేత లకోటా నాచేత బెట్టి దీనిని నీ ప్రాణములవలె భద్రముగా చూడుమూ అని హెచ్చరించి మొహరులసంచి యొకటి నా కిచ్చెను. (దానిని పెట్టును)

మాధ—ఇ దెవరికి కావలెను? లకోటా ఏదీ?

హను—నేను తత్క్షణమే బయలు దేరి నాలుగడుగులు పాగేసరికి తలరుమాలు ముఖముపై కప్పుకొన్న బంటొకడు దాని హరింప యత్నించెను. ధనము చూపితే దొంగ సంతసించునని యెంచి సంచి ముందుపెట్టగా వాడు నాచేయి నులిమి ఉత్తరము చేజిక్కించుకొని "ని న్నితక్షణమే ద్రుంచి రక్తాభిషేక మొనర్చియుందును కాని, నీ యజమానిరక్తము తాగితేనే కాని దీని దాహము తీరదు. అందుచేత నీమీద ప్ర

రోగించ"నని చెప్పుతూ రెప్పపాటులో అదృశ్యుడయ్యెను. ఎంత వెతికినా కానరాలేదు. ఇక కాలహరణ మెందుకని మీ కీవార్త నెరిగించడానికి వచ్చినాను. నా అశక్తతకు ప్రాణము లర్పించుమన్నా సిద్ధముగా నున్నాను.

మాధ—నీ ప్రాణము లెవరికి కావలెను? నిప్రవ్రయోజకుడా, నాయాజ్ఞ నిర్వహించక ఏ మొగముతో నిట వచ్చితివి? ఈక్షణమే పోయి జాబుజాడ తీసి చే జిక్కించుకొని రా; నీ ప్రాణములే కాక నా ప్రతిష్ఠ, రాజ్యహితము, ఆజాబు మీదనేఆధారపడియున్నవి. సంశయాత్ముడవై బయలుదేరితివి కావున కార్యము సానుకూలము కాలేదు. మనోధైర్య మున్నగాని మనయత్నములు ఫలించవు-యువకులకు శంకలు శోభాకరములు కావు-పో-ఈసారి జయ మొందుతావు-ఇదే నా ఆశీర్వచనము.

హను—నా దోర్బలమునకూ బుద్ధిబలమునకూ మీ ఆశీర్వచనబలము తోడైంది కావున ఈసారి జాబు తప్పకుండా తీసుకొని రాగలను. (పోవును)

మాధ—వీనికి వురి ఎక్కించినాను. వీడు కృతకృత్యుడౌనని నమ్మకముంది-



## —॥ నాల్గో రంగము ॥—

(మాధవాచార్యుని హోమశాల ముంగిలి)

భీమ—ఏడీ, జోగి యిక్కడ లేడే? మన యత్నము రిత్త యవునా ఏమి?

వీర—ఇక్కడ లేకుంటే లోపల నుండితీరును. ఇంకెక్కడికీ పోడు-భీమసింహా, ఈ చోటు నీకు సుపరిచితమే కదా నీవాళ్ళను కొనిపోయి శోధలన్నీ నిర్బంధించు-ఆచార్యుని భటులు అడ్డువస్తే వారి నందరినీ కట్టిపెట్టి, నేను సైగ చేసేదాకా వదలవద్దు-మాధవాచార్యుని పనిపట్టుట నా వంతు.

భీమ—వీరవిజయా, నీ కెవరైనా తోడుంటే మంచిది కాదా? ఎటుపోయి ఎటు వచ్చునో?

వీర—ముసలి తొత్తుకు, వాని నంత మొందించడానికి నా కొకరి సాయము కావలెనా? వాడు నాయెడనే కదా మహాపరాధము సల్పినాడు, కావున నా కరవాలముకే వానిని బలివేయుడము యోగ్యము. నీవు పోయి పై యేర్పాటులు చేస్తే చాలును.

భీమ—సరే-నే నవి చక్కజేస్తాను...(పోవును)

వీర—హోమశాలలో నెప్పుడూ ఉండేవాడు నేడు లేకపోవడానికి హేతువేమి? ఆచోకీ చిక్కనాపమి? ఇదివర కెక్కడికీ పోలేదు-భటులు చుట్టూ కావలియున్నారు-బోను లోని ముసలి నక్క పోలేదు-ఒకవేళ పరుగెత్తినా క్షణములో

పట్టుబడదా? ఏజిహ్వతో నాహంసేశ్వరిని కృష్ణరాయుని కర్పింతునని వాగ్దానము చేసినాడో, ఏచేతిని మహారాజుగారిచేతిలో వేసి ప్రమాణము చేసినాడో, ఆజిహ్వ ఆచెయ్యి ముక్కలు ముక్కలుగా ఖండించే దాకా నాకసి తీరదు. హోమశాల తలుపు తెరచియుంది- లోనికేగి వాడెటదాగియున్నదీ తెలుసుకొని బైటకు ఈడ్చవలెను.　　　(పోవును)

(మాధవాచార్యులు వచ్చును)

మాధ—ఏమిది? నే డకాలమున వర్షము పడుతూన్నది! ఏమి మేఘావరణము! ఇది రాజవిద్రోహు లెత్తిన నీలి పతాకమని నాకు తోచుతూన్నది...ఎంత మూర్ఖులు! పరమార్థ మటుండనీ, స్వార్థమైనా వీరు చక్కగా గ్రహింపలేకున్నారు-నిర్బుద్ధి దుర్బుద్ధులు సోదరులు-ఇద్దరూ సమాన దౌర్భాగ్యులే!

వీర—(లోపల) ఓరీ నీచా! ఇతరుల కళ్ళలోని పువ్వులు నీ కగుపడుతూన్నవి కాని నీకంటిలోని కాయ నీ కగపడలేదా? ఇతరుల రాజద్రోహమే నీకు కనబడుతూన్నది కాని నీవొనర్చిన మిత్రద్రోహము నీకు ప్రత్యక్షము కాలేదా? నీవు విద్రోహు లనుకొన్నవారు వాళ్ళనేరములకు తగిన శిక్ష అనుభవించడమునకు గాని, లేక పశ్చాత్తప్తు లగుటకు కాని కొంత వ్యవధాన ముంది; నీకో, కాలము సమీపించింది, కావున ఆప్రాయశ్చిత్తము కిప్పుడే కడంగుము-ఆ వెనక చింతించిన ప్రయోజన ముండదు.

మాధ—నే నూహించినది పొరబాటు కాదు-ఇట్టి సమయమున దౌరాత్మ్యమున నాయిల్లు చొచ్చిన న న్నవమా నించువాడవు నీ వెవడవు?

వీర—(లోపలినుండి) నే నెవ్వడ నైన నేమి? నీవు చేసిన మిత్రద్రోహముకు తగినశిక్ష నీకు విధించడాని కవత రించిన యముడను.

మాధ—ఓహో! యముడ వైతే నీవు త్రోవ తప్పి నావు-నిన్ను నీపురికి బంప నేర్పాటు సిద్ధముగా నుంది-ఎవ డురా అక్కడ?

వీర—నీ సేవకులందరూ నీకన్న ముందే యమపురి కరిగి, నీవు ఎప్పుడు వత్తువో అని స్వాగత మిచ్చుటకు సిద్ధముగా నున్నారు. ఓరీ మాయావీ! నీమంత్ర మికపారదు- నీ వెంత పిలిచినా పిశాచములు నీ కుత్తర మియ్యవు. ఒక్క అడుగు ముందు వేసితివా చావు తప్పదు. (మాధవాచారి చేయి పట్టుకొనును)

మాధ—ఓయీ! నీ ప్రల్లదములు ధృష్టత్వము నిక చాలు. నేను ముసలినైనా నీ జిత్తులకు జంకేవాడను కాను. (చేయి విడిపించుకొని) మాధవాచార్యు నెరుగవు, అతనికి స్వేచ్ఛామరణము కద్దు, శస్త్రముచేతగాని అస్త్రముచేతకాని మరణము సంభవించనేరదు, ఇది...జాతకబలిమి. నీ వొక డవే కాదు, నీ బలగమంతా వచ్చినా...కొనగో రూడదు-

నా రాజభక్తి, మైత్రి, తపమూ నాకెట్టి సామర్థ్యము నలవడ జేసెనో నీకు తెలియదు.

వీర—సామర్థ్య మెరుగలే కేమి? నీ ద్వారపాలకులను నీ స్వాధీనమున నుంచుకో లేనివాడవు, గ్రహములనూ నీప్రాణములనూ నీయధీనమున నుంచుకొన్నావంటే నమ్మేవా రెవరు? శత్రుడ వైతివేని నీ ప్రాణములను రక్షించు దిక్కుంటే చూపు.

మాధ—నీ వెంతదాచుకొన్నా నీ మాటలే నిన్ను బయలు పెట్టినవి-కాని నీపేరు నీనోటనే వినవలెనని కోరిక గలదు. అది చెప్పిన వెంటనే నీవు సంకల్పించుకొన్న బ్రహ్మ హత్యాది మహాపాపములకు ప్రాయశ్చిత్త మొనర్చవలసి యుంటుంది.

వీర—ఆసన్నమరణుని కోరిక అవశ్యాచరణీయము కావున దాని నిప్పుడే ఈడేర్చెదను. నే నెవడనో విశద ముగా చెప్పుతూన్నాను విను-ఎవడు యువరాజపదవి నొంద దమునకు సిద్ధుడైయున్నప్పుడు నీ దుస్తంత్రముచేత చెరసాల లో బంధింపబడెనో, ఎవడు హంసేశ్వరీ ప్రణయైక పాశబద్ధుడై ఆమెను పాణిగ్రహణ మొనర్ప సిద్ధుడై యుండి, నీ దుర్మంత్ర ణమున విఫలమనోరథు డయ్యెనో, ఎవని యర్ధాంగి సుగుణాల వాలను బలాత్కారముగా రాణిపదవి నధిరోహించిన రంపె లాడి ప్రేరణచేత వివేకశూన్యుడు నిరర్థకుడు నైన రాణి సోద రుని కిచ్చెదనని బాస చేసితివో, నీ యవగుణములు అకార్య

కరణములు కృతఘ్నతయూ ఎవని ప్రతీకారాగ్ని ప్రజ్వలింప జేసినవో వాడే వీడు.

మాధ—వీరవిజయూ, చల్లకు వచ్చి ముంత దాచెద వేమి? మొగముపై గప్పుకొన్న గుడ్డతీయుము- కాని ఒకవిషయ మునకు మాత్రము సంతసించినాను- నీ చేతులూ మనస్సూ ఎంత ద్రోహమూ పాపమూ చేయబూనినా, నీ మొగము నా కగుపడడానికి వెనుతీయుడము వల్ల నీవు సమూలమూ కల్మషుడవు కాలేదు-అదీ మేలే!

వీర—నీవు నన్ను పోల్చుకొన్నావన్న వింత కాదు. నా కహితమొనర్చడమే నీకు నిత్యకర్మ-అట్టి నన్ను నీవు మరతువా?

మాధ—నిన్ను చూడ నాకు జాలి వేస్తూన్నది-

వీర—ఇంతవర కట్లయ్యేను కదా, ఇంక నీమరణ మాసన్నమయినది కనుక నీ ప్రాణముల ఎడనూ, నీయూహాల యెడనూ జాలి పడుము. ఓరీ టక్కరిబాపడా! నీ వింతవరకూ దాల్చిన పరోపకార రాజభక్తి వేషములు విప్పి నీ యథార్థ రూపము బైట పెట్టు.

మాధ—వీరవిజయూ! ఇక నీ అవమతి చాలును-నీ ధూర్తత మితి మీరుతూంది....ఇంకొక మాట యాడక తొలుత నాపాదములకు మొక్కి నా క్షమాపణ కోరుము. లేనిచో ఇదివర కే హద్దుమీరిన పశ్చాత్తాపమున నామీద నీవు ప్రయోగించదలచిన ఖడ్గము నీమీదనే ప్రయోగించు

కొనవలసి వచ్చును...నీ అపోహలు మేర మీరినవి. నీ వింత మందబుద్ధివని నేను కలనైన తలంపలేదు. కూరిమి వీర నమ్మి నా నేరము లే నీకు తోచుతూన్నవి ..నీ ఆవేశము కొంచెము తగ్గించుకొని నా మాటలు సావధానుడవై ఆల కించుము-చిరంతన కారాగారవాసమున నీ జీవితమును నిరర్థకము చేయనెంచిన మహారాజుగారి నిశ్చయమునకు ప్రతిఘటించి నీచెర బాపిన దెవరు? రాణీగారివంటి మహామాయావి దుర్వ్యూహమును భేదించి యువరాజపదవిని నీ కొసగడానికి సత్యాగ్రహము చాల్పిన దెవరు? నీ మురిపెంపు ముద్దరాలు హంసేశ్వరిని నీకు పెళ్ళిచేసి ఈ సంస్కృతిని వీడ కృతనిశ్చయు లెవరు? అట్టి నీ పరమబంధువు పోషకుని ఋణము నీ వీజన్మ మున తీర్చగలవా? వీరునకు కేవల శౌర్యమూ, ధైర్యమే కాక కృతజ్ఞత కూడా ఆవశ్యధర్మమేనా?...ఇదంతా బూటకమని నీ వనుకోవడమునకు వీలుంది-కాని నీమనస్సున గట్టిగా నాటు కొను పరాభవమార్గ మింకొకటి యున్నది. ఆదారి నేను తొక్కితినా నీ అవిమృశ్యకారిత యావజ్జీవమూ నిన్ను బాధించ గలదు.

వీర—అమాత్యపదవి నధిరోహించిన నీకు ఆలోచన లకు తక్కువా? అన్ని శాస్త్రములూ అభ్యసించిన నీవు వాద నిపుణుడవు; దృష్టాంతములను, హేతువులను కావలసినన్ని కల్పించి "నందిని పంది, పందిని నంది" చేయగల సామర్థ్యము నీకున్నది-నీవీ కుతర్కము లిక కట్టిపెట్టి ఇష్టదైవమును స్మరించి

పాపపరిహారమును చేయ ప్రార్థించుము-వేరు మాటలతో విలంబనము చేయకు.

మాధ—(నవ్వి) హంసేశ్వరీ!

వీర—ఆ నామ ముచ్చరింపకు, నీ పాపమంతా బైటపడును. ఆమెను కృష్ణరాయ యువరాజ వతంసునకు ప్రధానమొనర్చి రాణిగారి యధీనమున వజ్రపంజరమందు కీరాంగనవలె భద్రపరచి నా మనోనిశ్చయము పెడతోవలో పెట్టవలెనని చూస్తూన్నావు-ఇంక నాలస్యము చేయను. (కత్తిమాయును)

మాధ—అమ్మా! హంసేశ్వరీ! బిరాన రా! నీ ప్రియుడిదే తన కృతజ్ఞతాపూర్వక రక్తాభిషేకము నాకొనర్ప నున్నాడు; ఇంకా నిద్రపోతూన్నావా? ఈ వైభవము చూడ వేగ రమ్ము.

వీర—(తెల్ల పోవును)

(హంసేశ్వరి వచ్చును)

మాధ—వీరవిజయా! నే నన్న మాటలు నిజమువునో కాదో ఈమె నడిగి అనంతరకర్తవ్యము నిశ్చయించుము.

వీర—(నివ్వెరపడి) ఏమిది! మహారాణిగారి అంతఃపురమున బంధింపబడ్డ నా ప్రేయసి ఇక్కడి కేలాగు వచ్చింది? తరుణీమణీ, నీ విక్కడి కెట్లు రాగల్గినావు? ముందు చెప్పు.

హంసే—(ఆశ్చర్యముతో) నా మాట కేమిగాని, మీ రిట్లర్ధనిశీథమున అకస్మాత్తుగా రావడమేమి? నాతండ్రి మీ

పోషకులైన ఈ మహాపురుషునిపై కత్తి యెత్తడ మేమి? మీచిత్త మిట్లు భ్రాంతమవుటకు హేతువు ముందు చెప్పండి.

మాధ—బేలా! అట్లడిగెద వేమి? కన్యాదానము నమధుపర్కము కదా; తీరుని నారక్తముతో కలిసిన మధు పర్కముగాని యితరము నా అల్లునికి రుచింపదు.

హంసే—అయ్యో! అయ్యో! ఎంత ప్రమాదము! ఎంత ద్రోహము! ఏమి కృతఘ్నత! ఇట్టి ఘోరకృత్యము చేసే ప్రవృత్తి మీ కేలాగు కలిగింది? మీరు తురకు దేశద్రోహు లతో కలిసినారా? మహారాజుగారు మీకు ఘటిల్ల జేయనున్న శాశ్వత కారావాసము తప్పించి, మిమ్ము యువరాజపదవిని ప్రతిష్ఠించ ప్రతిజ్ఞ జేసిన నాతండ్రిమీద కత్తి నెత్తుదురా?

వీర—ప్రేయసీ, నీవు రాణిగారి అంతఃపురమున బం ధింపబడ లేదా? నిన్ను కృష్ణరాయుని కిచ్చి వివాహము చేసెద నని ఈతడు మహరాజుగారి చేతిలో చేయివేసి ప్రమాణము చేయలేదా?

హంసే— రామరామ! ఏమి అపోహములు! ఇ వెవరు కల్పించినారు; రుద్రదామునకు రాజుగా రిచ్చిన చనువునకు ప్రతిగా తమ దూరాలోచనా పటిమచే రాజకుటుంబమునకు ప్రతిఘటించిన న న్నా అంతఃపురమున నుండనివ్వక, కంటిని రెప్పవలె మనల నిద్దరినీ కాపాడుతూన్న అమాత్యరాజుగారి యెడ అపోహమా? ఎంతప్రమాదము!

వీర—(కత్తి పారవేసి నెత్తి కొట్టుకొని) అన్నా!

ఎంత ఘోరమైన వంచనపా లైనాను. నాబుద్ధి గడ్డి తిన్నది-మహాపాతకి నైనాను-ఇక మీతో మాటలాడడమునకై నా తగను. ఈ పాపము పరిహరించుకొనజాలను-

మాధ—వీరవిజయా, నా మాటలయం దిప్పటికైనా నమ్మకము కుదిరిందా?

వీర—అమాత్యమహారాజా! పరమలజ్జాకరమైన ప్రవృత్తి నా కలవడినది కావున ఇక మొగ మెత్తుకొని తిరుగ లేను. పసిబాలున కుండదగిన వివేకమేనా నాకు లేకపోయింది. (అమాత్యుని పాదములపై బడి) మహాత్మా-పరిభ్రాంతుడనైన నాతప్పు మన్నించండి, లేదా, ఆత్మహత్య చేసుకొన సెల వొసగండి-మీదయకు గానీ మీ పోష్యపుత్రిక ప్రేమకు గానీ నేను పాత్రుడను కాజాలను. మీయెడ నేను చేయదలచు కొన్న ద్రోహము భావింప తరము కాదు. మీరు క్షమింప కున్న నా కిహపరము లుండవు.

హంసే—తండ్రీ! తనయులతప్పులు తండ్రులు క్షమించకుంటే ఇక వారి కేది దిక్కు? ఇంతకూ ఈతని నైజము మీ రెరుగనిది కాదు-ఈతని దోషమును సైపుడని ప్రార్థించుటకు నాకు కూడ నోరాడదు. (పాదములపై బడును)

మాధ—వీరవిజయా! లెమ్ము, అమ్మా లే. నేనంతా ఎరుగుదును. ఇతనియెడ నాకు రవ్వంతైనా కోపము లేదు. చెప్పుడుమాటలచేత ఈతని మతి చెడినది నాయందు కూర్మి లేకపోవడముచేత నా పనులన్నీ అతనికి ప్రతికూలముగా

దోచినవి. ఈతనియందలి గొప్ప లోపము ఆత్రము. తనవాడెవడో పరు డెవ్వడో విమర్శించు వివేకమునకు ఆలోపము వేరువిత్తు. ఈతనికి నా యెడ నింతకోపమునకు మూలహేతువు నీయందలి అనురాగమే. ఇంక కొంతకాల మోపికపట్టితే మహా వైభవముతో మీకు వివాహము చేయవలెనని ఎంచితిని. కాని వడుచువారి కంత తాలిమీ, నిమ్మళమూ ఉండవు, కావున యిప్పుడే మీకు వివాహ మొనర్తును. నాపై నాతడు కినిసె నన్నమాట మరచి నీ వెప్పటివలె ప్రేమించు. (వారి చేతులు కలిపి) ఇదే నాప్రతిజ్ఞ నెరవేర్చుకొన్నాను. ఇక మిగిలినది దైవయత్న మైనా, నేనూ సాధ్యమైనంత వరకూ యత్నము చేసి తీరుతాను. ఆపైని మీ అదృష్టము (తలుపు చప్పుడు)

వీర—(హంసేశ్వరి చేయివీడి కత్తి పట్టుకొని) అన్నా! ప్రసంగవశమున పరిస్థితులను నేను పరికించలేదు. బందుకట్టువారందరూ బైట వేచియున్నారు. నా మూర్ఖతచేత మీకు ప్రాణగొడ్డము సంఘటింప జేసినాను. అది తొలగేఉపాయము నాకు స్ఫురించకున్నది.

మాధ—వీరవిజయా, నీవు వెరవకు-నా ప్రాణముల నపహరించుట కేమానవుడూ సాహసించలేదు.

వీర—అయ్యో! ఈ యాపద సామాన్యము కాదు-బైట శస్త్రధారులై ముప్పదిమంది ఉన్నారు-వారి కేమి సమాధాన మివ్వవలయునో నాకు తోచలేదు.

మాధ—మనము భయపడనక్కరలేదు-నా ఆశ్రమ

మంత దిక్కు లేక యుండ లేదు-నపరి వారుడై భీమసింహుడు కాచుతూ న్నాడు- వాడు మడిసేదాకా మన కేచింత అనవసరము.

వీర—అట్లు తలంచకండి-మీ నౌకరులందరూ మా కూటములోని వారే! ఇదంతా భీమసింహుని పన్నిన కుచ క్రమే. వాడు నావెంట వత్తు ననెను, కాని ద్వారములవద్ద వానిని కాపుంచి నేను లోన ప్రవేశించినాను.

మాధ—సరే-రహస్యమైన భూగర్భమార్గమున వెడ లుదాము.

వీర—అదీ అరికట్టబడ్డది - భీమసింహు డెరుగని తోవలు లేవే? అతడన్ని ద్వారములయందూ శస్త్రపాణు లను కాపుంచినాడు-వారందరూ మీకు శత్రువులైనారు!

మాధ—అబ్బా! చతురుడే. అన్ని ఇంద్రియ ద్వార ములూ బంధించి యజ్ఞపశువును బోలె నన్ను విద్రోహాగ్నికి బలియొసగ నెంచినారా? గడుసువారే! మొత్తముపై నాకు రక్షణోపాయము లేకుండా చేసినారే!

వీర—నాచేత శస్త్ర మున్నంతవరకూ మీదరి చేర గల్గువా డెవడు? మీకు భీతివలదు.

మాధ—నీ కంతశ్రమ వద్దు-నేను వరదునని విద్రో హులు నామకరణము చేసేయున్నారు. ఒకసారి నా చాతు ర్యము వారి కగుపరుస్తాను. కత్తి కంతగా పని కల్పించ నవస రము లేదు. యుక్తిచేతనే సాధిస్తాను, లోనికి పద...

——— (పోదురు)

## —ఐదో రంగము—

(ఆశ్రమద్వారమున భీమసింహుడు)

భీమ—వీరవిజయుడు లోనికేగి చాలాసేపయింది, ఇంకా రాలేదు-ఒకవేళ వృద్ధజంబుకము వానిని వలలో వేసుకోలేదు కదా! వా డేమైన నాకేమి? నా పురోవృద్ధి కడ్డుకర్ర గానున్న అమాత్యుడు హతుడయితే నాపని నెరవేరినట్లే... వీరవిజయు డింతాలస్య మేల చేసినాడు? నావని కాటంకము కలుగుతూన్నది. ఇక నేమాత్రమూ ఓపిక పట్టజాలను. (లోన ప్రవేశింపగా వీరవిజయు డెదురౌను)

వీర—మిత్రమా! మనకు జయము. మాధవాచార్యుడు మడిసెను. ఇక నందరమూ ఉత్సవ మొనర్తము-దుష్టుడు దండించబడెను. భీమసింహా! కార్యక్రమ మెంత నేర్పుతో కావించినానో చూచెదవా? అందరూ వద్దు. మనపని ఆద్యంతమూ రహస్య మౌట మంచిది.

(తెర తీయుగా మాధవాచారి మంచముపై పరుండును.)

అదె చూడు-తన జీవితమెల్ల కపటమునా కుతంత్రముల యందూ గడిపి నేటికి శ్రాంతి చెందిన మాధవాచార్యుని శిరమదిగో! అయ్యా! అమాత్యవర్యా! ఇంక నిశ్చింతతో శ్రాంతి చెందుము. మహారాజుగారిని భ్రమపెట్టియూ, భయపెట్టియూ తన కార్యములను సాధించుకొను అమాత్యశేఖరు డస్తమించినాడు-కపటము కడచనినది, ఇక ప్రతాపవంతుల

తేజోదయము ప్రారంభమగును.

భీమ—కాని చిత్రముగా నుంది-ఇచ్చట హత్య జరిగిన చిహ్నములే కానరాకున్నవి-ఒక రక్తబిందువైనా చిందలేదు. చావకముందు ప్రాణరక్షణమునకు పాకులాడనే లేదా?

వీర—బ్రతికియుండునప్పుడు వాని ముందర మన కాళ్ళుచేతు లాడని తీరున మృత్యు వాసన్నము కాగానే నా ముందర అతని కాళ్ళూచేతులూ ఆడనేలేదు! ఏమ్నకత్తితో నే నెదుట నిలచినంతోడనే అంతటి జెత్తులమారియూ నిలువున నీరయిపోయినాడు-గుక్కెడు ప్రాణమూ గుండెలోనే పాతువడ్డది-చలనములేని శవము! కలముతో పనిచేసేవాళ్ళందరూ పిరికివారు కావున కత్తి చూడగానే తమంత తామే చత్తురు-ఆతడు నన్ను చూచినతోడనే బెదరి తల వంచుకొనెను. నే ననవలసిన దంతా అన్నాను-మన కందరికీ పేర్వేర్వాయన చాతడొనర్చిన అపకారములను ఏకరువుపెట్టేనరి కాతని కళ్ళలో నీరు గిర్రున తిరిగింది. అప్పుడు నేను "నిన్ను నీవు కాపాడుకో దలచితివేని సిద్ధుడవు కమ్ము, లేదా నీసేవకులను పిలుచుకో" అని హెచ్చరించితిని. కాని వాతరోగివలెనే మంచముమీద నున్నవా డక్కడనుండి కదలనే లేదు

భీమ—నీ కత్తికైనా రక్తము లేదే!

వీర—అదే చిత్రము-నన్ను చూడగానే మేకపోతు గాంభీర్య మంతరించినది. పాపము బ్రాహ్మణుడు, కర్మిష్ఠి-అట్టి పిరికివాని రక్తస్పర్శచేత నా కరవాలమునకు కల్మష

మంటించ దలపక యజ్ఞపశువును మర్దించినట్లు నవరంధ్రములూ మూసి చంపితిని. పిమ్మట కొనయూపి రుండగా అతని శాలువతోనే మెడ నులిపి కిక్కు రనకుండా ప్రాణము పోయేవరకూ గుండెమీద కూర్చుండి కదలనివ్వలేదు-అందుకే ఆలస్యమయింది.

భీమ—హా సర్దారుపదవికి సంతతవిఘ్నకారి యైన నా గర్భశత్రువును నరకమున కంపి నాకు మహోపకార మొనర్చిన నీమేలు మరువజాలను-ఇప్పుడే ఆపదవి నాకు లభించినట్లు సంతసిస్తున్నాను.

వీర—రేపు నిజముగా సర్దారు వైనప్పుడు నీసుఖము ద్విగుణించదా?...మాధవాచార్యుని మరణవార్త తనకు ప్రథమమున నెరిగించిన వానికి సర్దారుపదవిన్ని పదివేల మొహర్లున్ను యిస్తానని కృష్ణరాయ యువరాజుగారు శాన తిచ్చినారు-ఆపదవి నీకు కులక్రమాగతము, కావున తత్ ణమే పోయి పారితోషికము పుచ్చుకొని రా. నేను మాధ చార్యులు ప్రాణముల నంతరింపచేసినాను కావున అతని శరీర మునకు నగ్నిసంస్కారము కావించి వత్తును. అప్పటికి కాని నా ప్రతిహింసాగ్ని చల్లారదు.

భీమ—(స్వ) ఓహో, పారితోషికముమాట జ్ఞాప కము చేసినాడు, వీ డేమైనా నాకు చింతలేదు. (ప్ర) వీరవిజయా! నీకార్యము నీవు ముగించుకోవచ్చును-నేను ముందే పోయెదను, మీరు పిమ్మట రండి.

వీర—ఎంతో ఆలస్య ముండదు (భీమ॥ పోవును)

మాధ—(లేచి) వీరవిజయా! నూతనపాత్రము కడు నేర్పుతో నటించినావు-బలే! నాకు తగిన అల్లుడవే-నేను మరణించితినని వీరు పూర్తిగా సంతసించక ముందే వీరి యాశలు భగ్నము లవును. హంసేశ్వరివద్దకు పోదాము, ఈ కార్యమున ఆమె మనస్సు కలవరపడి ఉన్నది, వెంటనే పోయి ఊరడింతాము, రా. (పోదురు)

---

—॥ ఆరో రంగము ॥—

---

(కృష్ణదేవరాయుని చావడిలో అతడూ రుద్రదాముడూ)

కృష్ణ—సరే. మనగురి తప్పలేదు కదా! భీమసింహుడు తన గుడిసెకు కాపున్నాడని మాధవాచార్యు డనుకొంటూ ఉండగా, ఆతడు ఆచార్యుని అభిమాన పుత్రిక మీనాక్షితో కూడి ఆచార్యుని బంట్లనే అతనికి ప్రతికూలముగా బందు కట్టులో చేర్చుతూండెను. భళిరే! మాధవాచార్యునకు నేడు శృంగభంగమూ మరణమూ ఆసన్నమానుః కదా!

రుద్ర—సందేహ మేమి? ఒరంగలు బందిఖానానుండి తమ ఉత్తరువు లేక వీరవిజయుని ముక్తుని చేసినందుకు మహారాజుగారి కాతసిమెడ కోపము రెట్టించింది. అవమానాస్పదమైన హంసేశ్వరి ప్రవర్తనము వారి కోపాగ్నిలో ఆజ్యము పోసినది. మాధవాచార్యునికి నిన్నరాత్రి పట్టినగతి రేపు వీర

విజయునికి సంఘటిల్లనున్నది-మనము కావించిన చెడుపను లన్నీ మాధవాచార్యచోదితములని రాజుగారికి విశ్వాసము కలిగింది-యువరాజశిరోమణీ! ఈ యుత్తరవు తిలకించండి-వీరవిజయుడిక నా కంట పడడమే తడవుగా వానిని తిరిగీ కారాగృహముదారి పట్టించుతాను. ఇటుపైని తప్పించే దిక్కుండదు కనుక వాడు యావజ్జీవ మచ్చటనే పాతుపడును.

(దౌవారికుడు వచ్చును)

దౌవా—దేవరా, వెలుపల నెవడో బంటు తారు మారుగా దుస్తులు ధరించి రోజుతూ పరుగెత్తి వచ్చినందున మాటలాడనేరక దేవరవారిని చూడవలెనని సంజ్ఞ జేసినాడు.

రుద్ర—మంచిది, వానిని ముందు పంపి శస్త్రధారులైన మన కావలిభటులను సిద్ధపరుచుము. (దౌవా॥ పోవును) బహుశా వాడే వచ్చియుంటాడు, ఫలశ్రుతికై ఇచ్చటికే రమ్మని చెప్పినాను. (భీమసింహుడు వచ్చును)

భీమ—దేవరా, మనకు జయము! కార్యము ఏరవ్వా లేకుండా సమగ్రముగా కడతేరింది-మాధవాచార్యుని మరణ వార్త మీకు కెరిగించినాను, నాకు రానున్న పారితోషికద్వయము దయచేయండి.

రుద్ర—నిజమే? మాధవాచార్యులు మరణించెనా? నీవు కళ్ళార చూచినావా? సంశయము లేదు కదా?

భీమ—నిస్సంశయము కావుననే మీకు కెరిగించినాను.

కృష్ణ—ఏదీ! విశదముగా చెప్పు.

భీమ—అతనికి తగిన మరణమే ప్రాప్తింప చేసినాము. అతని శాలువే మెడ కురిపోసి, యజ్ఞపశువులీల ప్రాణములు హరించి, నిశ్శబ్దముగా సర్వమూ నిర్వహించినాము; చప్పుడు కాని కేక గాని, కొట్టుకొనడము గాని లేకుండా యమపురికి అమాత్యశేఖరు నంపించినాము.

రుద్ర—(కృష్ణరాయుని చెవిలో నేదో చెప్పి లేని కోపము తెచ్చుకొని) ఓరీ స్వామిద్రోహీ! మాధవాచార్యుని ప్రమందించితి రా? నీచులారా! ఆ మహాత్మునికి హేయమైన మరణ మాపాదించడమే కాక పైపెచ్చు ఈ వీర కర్మకు పారితోషికము నడుగుతూన్నావా? ఓరీ సిగ్గుమాలిన వాడా!... ఎవడురా అక్కడ! (శస్త్రధారులైన భటులు వత్తురు) వీని రెక్కలు వెనుకకు విరిచి కట్టండి. ఓరీ, రాజద్రోహీ! నీవు చేసిన ద్రోహమునకూ హత్యకూ పారితోషిక ద్వయము కావలెను గా? నీ పశ్చాత్తాపమును పిమర్శించి తగిన బహుమతి యిచ్చెదము ఓపిక బట్టుము. ఓరీ వీనిని చెరసాలకు గొనిపోయి ఒంటరిగా చీకటిగదిలో నుంచండి...

భీమ—ఓరి నీచా! నీ కార్యము మాచే నిర్వహింప జేసి మమ్ము వంచింతువా? పారితోషిక మిస్తా ననలేదా నీవు?

రుద్ర—వదరుబోతా! నోరు మూసుకో-నీకు నే నొడంబడితినా? ఓరీ! ఉన్నకొద్దీ వీ డిట్లే పేలుచుండును-త్వరగా తీసుకొని పో-

భీమ—సరే-ఇందుకు తగిన శిక్ష అనుభవింతువు లే.

(పోవుదురు)

రుద్ర—ఒకని పని తీరింది-వీడు యావజ్జీవమూ బందిఖానాలో నుండును కదా? యువరాజా! ఇక వీరవిజయుని కూడా వీనికి తోడుచేస్తే మిగిలిన వారిని బెదిరించి ఊరు వెడలింపవచ్చును-అంతటితో గాని మన విజయము పరిపూర్తి కాదు.

కృష్ణ—సరే కాని-పాపము వీళ్ళు మనకు కొంత ఉపచరించినారు, కనుక ఏదైనా మేలు చేయడము న్యాయము, లేకుంటే ఉసురు మనకు తగులక మానదు.

రుద్ర—రాజకార్యనిర్వహణమందు ఒకానొకప్పుడు విశ్వాసహీనులయిన బంటులు కూడా ఉపయోగపడుతారు, కాని అవసరము తీరిన పిమ్మట వారి నంతమొందించకుంటే వాళ్ళే ఎదురుతిరుగుతారు; వాళ్ళతో తీరవలసిన పనికి గొడ్డలి కావలసి వస్తుంది. రాజనీతి పుణ్యమూ పాపమూ చూచేది కాదు.

కృష్ణ—మాధవాచార్యుని మరణమువల్ల మన కొక గొప్ప సంకటము తొలగింది-

రుద్ర—వాడు బ్రతికియుండినా కోరలు తీసిన పాములాగు ఊరకే బుసకొట్ట వలసిందే-వానిని పదవిచ్యుతుని చేయవలెనని మీ అక్కగారు పట్టుబట్టినారు; పిమ్మట నిర్మాల్యప్రాయుడైన మంత్రి నెవరు సరకుచేయుదురు? మాధవాచార్యుడు బ్రతికియుండి వీరవిజయుని ఉరితీసి యుంటే హంసేశ్వరి మీకుస్వాధీనయై యువరాజపదవి మాత్రమే లభించియుండును.

ఇప్పుడో—మాధవాచారి మరణము, మాలిక్ కాఫరు ప్రవేశము, మీ భావగారి ఉద్వాసనమూ,—మొదలైన శుభసూచకములు మీ రాజ్యాభిషేకమును స్థిరీకరించుచున్నవి. కొంచె మోపికపట్టితే సర్వమూ మన కనుకూలించి తీరును

(ద్వారికుడు వచ్చును)

ద్వా—జయము, జయము దేవరా! వెలుపల బంటొకడు నిలిచి యున్నాడు.

కృష్ణ—రమ్మను-వీ డెవడో?

(హనుమ వచ్చును)

రుద్ర—ఏమిది! వీడు మీ తాతల సోదరుడు! ఏమిరా నీ వింకా ఇక్కడే ఉన్నావు? లకోటా ఏదీ?

హను—దేవరా, మామిడితోట దాటగానే ఎవడో శస్త్రధారుడు నావద్దనుండి బలాత్కారముగా దానిని హరించినాడు.

రుద్ర—వా డెవడో తెలుసునా?

హను—వాడు ముఖమును రుమాలుతో కప్పుకొనడము చేత చీకటిలో పోల్చ తగులేదు.

రుద్ర—ఓరీ పిరికిపందా! నీవు పోయి లకోటా ఎక్కడున్నది కనిపెట్టి దానిని నా కిచ్చితివా గొప్ప పారితోషికమిస్తాను, లేదా ఉరి తీయిస్తాను; మూడు రోజులు గడువు, పో.

కృష్ణ—అన్నా! అది తురకల కందనే లేదా? మోసగా డెవ్వడో దానిని హరించినాడు. అది మహారాజుగారి

చేతిలో పడితే మన గతేమవును?

రుద్ర—యువరాజా! అధైర్య పడకు-అది నా చేతనే ఉన్న దనుకో-రెండు రోజులలో దానిని మీకు చూపుతాను. మహారాజుగారి దగ్గరకు పోయి వారి జాలు కనిపెట్టి ముందు చేయవలసిన కార్యక్రమము నిర్ణయింతాము. ఇది మనకు నిజముగా పరీక్షదినము.

కృష్ణ—మాధవాచార్యుల మరణము గురించి వారి వద్ద నెట్లు ప్రసంగించవలెనో నాకు తెలియకున్నది-

రుద్ర—దానికై మీరు చింతించకండి-మహారాజుగారి చిత్త మెట్లుండునో దాని కనుకూలముగా ప్రవర్తించే నేర్పు మా కగ్గుపాలతో నేర్పిందే ఆ విషయము చక్కగా గమనించితే మన కేమీ అపాయ ముండదు. మోసము సంగతి ఎత్తనే వద్దు.

కృష్ణ—మహారాజుగారి చిత్తవృత్తి కనిపెట్టడమేలాగు?

రుద్ర—మీరూరకుండండి-అంతా నేనే చక్కబరుస్తాను.



—॥ ప్రవేశకము ॥—

(రాజూ రాణీ కొందరు రాస్థానీకులు)

హర—అమాత్యవర్యుఁడస్తమించడము వాస్తవమేనా?

రుద్రి—అట్లే నేనూ విన్నాను.

హర—అయ్యో! ఎట్టి కార్యధురీణుని కోల్పోయినాను. ఈ లోప మెట్లు తీరునో తెలియరాదు. ఇక మన రాజ్యలక్ష్మి దిక్కులేనిదయింది,

రాణి—(పరిహాసముగా) ఔను-మన రాజ్యమనాథ అయింది- అమాత్యరాజే కాని నేలుతూండెను-అతఁడు గతించెను కావున రాజ్యమునకు దిక్కు లేదన్న మాటే?

రుద్రి—(స్వ) ఇందు నేను జోక్యము కలుగజేసుకోవడానికిదే సమయము. (ప్ర) అమాత్యశేఖరుఁడు అస్తమించిన పిదప రాజ్యలక్ష్మి దిక్కులేనిదని మీ వినయము వ్యక్తపరిచినారే కాని వాస్తవముగా అట్లు జరుగలేదు మీ మాటకెదురుచెప్ప వలసి వచ్చింది కనుక మన్నించండి. అకారణముగా మీరు అమాత్యుల వారిని బహూకరిస్తూండిరి. అందుచేత మీ కొలువులోని పలువురకు వారు దుస్సహులైనారు. అదొక వింత కాదు. వారు మమ్మందరినీ తృణప్రాయులుగా భావిస్తూండిరి-మా లెక్క ఏమి? క్రమముగా వారికి మీ మాటయందు కూడా విలువ లేకపోయింది, అప్పుడే రాజ్యలక్ష్మి

దిక్కు లేనిదని మేమనుకొంటిమి, ఇప్పుడో సరియైన దిక్కు నమకూడింది.

రాణి—రుద్రదాము పల్కు సత్యము. మాధవాచార్యులను వ్యక్తి మరణమునకు మనము చింతించవలసినదే కాని రాజ్యమిప్పుడు నిజముగా సనాథ అయింది. ఇక సభ్యులు రాజసన్నిధానమున తమ కష్టసుఖములు యథేచ్ఛముగా మనవి చేసుకోగలరు.

హర—మీ మాటలు సత్యమే కావచ్చును కాని అమాత్యుని మరణము తలుచుకొంటే మన పట్టణము శూన్యమయిందనే నాకు తోచుతూన్నది. వారు కొంచెము తీక్ష్ణస్వభావులూ, శీఘ్రకోపులూ అవుటచేత వారి ప్రాబల్యము నాకూ రుచించేది కాదు, కాని చిరతరాభ్యాసము చొప్పున వారి నెదిరించడమునకు సాహసించలేదు. రాజునై యుండీ అప్పుడప్పుడు పరతంత్రుడనైతి ననీ, అతని ఇచ్ఛాశక్తికి దాసుడనైతిననీ తోచి పరాభవానలముచేత దహింపబడినది సత్యమే. వారు జీవించియున్నప్పుడు వారి అధికారలిప్సకై నాకు మత్సరముండేది, ఎదురించ కోరికయూ కొంతవర కుండెను-కాని వారి మరణవార్త విన్నతోడనే నా చిత్తమున కలవర మారంభించింది. వేగాతిశయమున ఉప్పొంగి పొంగొచ్చిన యవన సేనావాహిని నరికట్టు వారెవ్వరు? మన ఉత్తరమున దక్షిణమున వ్యాపించిన శాత్రవాబ్ధి కృష్ణానది దక్షిణతీరమున అడచినవారెవరు? ఏకాధ్వరముగా ఏడుశతాబ్దములు విలసిల్లిన

బల్లాళప్రభువుల రాజ్యము లంతరిస్తూండ, ఓరుగల్లు ఆనగొంది రాజ్యము లస్తమిస్తూండ ఈ విజయనగర రాజ్యమును ప్రతిష్ఠించిన దెవరు? న న్నీ సింహాసనమున ఆసీనుని చేసినవా రెవరు? అట్టి అమాత్యమాధవునెడ కృతజ్ఞుడను కానా?... ఆర్యా! మాధవాచార్యా! నన్ను దిక్కులేనివాని చేసి మీరు దివమున కేగినారా?...(పోవును)

రాణి—అబ్బో! ఈ రాజుగారి చపలచిత్తము కృతజ్ఞతా ప్రవాహమున కొట్టుకొని పోతూంది-బుద్ధిహీనులైన రాజులు రాజ్యభారమంతా అమాత్యుల భుజములపై మోపియుం డుటచేత వారు గతించినవెనుక విభీతచేతస్కులై యిట్లే మొర పెట్టుతారు.

రుద్ర—సందేహ మేమి? ఇందర ముండగా ఒకడు గతించిన నేమి లోపము!

(పోదురు)

—॥ ఎనిమిదో రంగము ॥—

(రాజప్రాసాదమువద్ద హనుమ)

హను—లకోటా తిరిగీ సంపాదిస్తానని మాటయిచ్చి గురువుగారి దీవన లంది వెడలినాను గాని మాట దక్క సూత్ర మేదీ కానరాకున్నది-కృష్ణరాయ రుద్రదాముల చేతు లలో అది పడలేదన్నమాట నిశ్చయము. భీమసింహ వీర

విజయులవద్ద ఉండవలెను. అది నాకు చిక్కే మార్గము తోచదు.

(వీరవిజయుడు వచ్చును)

వీర—రుద్రదాముడు నన్నిట్లు వంచించెను. నాపై ప్రేమ ఉన్నట్లు నటించి మాధవాచార్యునిపై నాకోపము రెట్టించి నందున నేనెంత ఘోరకృత్య మొనర్ప నమకట్టి నాను! ఇప్పు డాఖలుడు రుద్రదాముడు నాకంట పడితే పర నిందాపరాయణుడైన వాని నాలుక తెగకోస్తాను. మహా రాజుగారి ప్రాపున్నదని నేను జంకువాడను కాను.

హను—ఎవరది? ఓహో వీరవిజయులా?

వీర—నీ వెవడవు? తొలగి పో-నాకు కావలసినవాడు రుద్రదాముడు-

హను—దయచేసి నాకొక సంగతి సెలవిస్తారా? మనపట్టణమందలి దేశద్రోహులు యవనసేనానియైన దాఉద్ ఖానుకు వ్రాసిన జాబు మీవద్ద నున్నదా?

వీర—నీ వెవడవు?

హను—అయ్యా! మీరు! నన్ను పోల్చుకొనలేదా? నిన్న రాత్రి అమాత్య మాధవాచారిగారిని చంపుటకై మీరూ నేనూ కుచక్రమం దున్నవారము. దైవయోగమున నేడు మనమిద్దరమూ వారిప్రేమకు పాత్రులమై వారికి యథాశక్తి తోడ్పడు తూన్నాము. ఆకోటా వృత్తాంతము మీ కేమ యినా తెలిసి ఉంటే చెప్పండి.

వీర—నిన్న రాత్రి తోటద్వారము కడ నిలిచియుండిన వాడవా నీవు? (రుద్రదాముడు కాన వచ్చును) ఓరీ కూళా, అధమా, రుద్రదామా, చక్కగా చిక్కినావు, నిన్నే వెతకు తూన్నాను-

హను—అయ్యా! క్రోధవశమున ప్రమత్తులు కావద్దు. మహారాజుగారు కూడా వస్తూన్నారని విన్నాను. వారి యెదుట రుద్రదాముతో కలహించవద్దు. లకోటా చేతచిక్కు వరకూ మనము తామసించరాదు, పిమ్మట అమాత్యులవారే అతని నురితీయింతురు; లకోటా ఏమైనది?

వీర— భీమసింహాలు నడుగు. ఓరీ రుద్రదామా, ద్రోహీ-నీపేగులు చీల్చి నీకుత్రులనెల్ల బైట పెట్టెదను చూడు.

రుద్ర—ఏ మంటివి? నేనా ద్రోహిని?—

ఇద్దరూ పోరుదురు—

హను—అయ్యా! పోరు మానండి-మహారాజుగారు దయచేసినారు...(పోవును)

రాజు—ఏమిది? రాజప్రాసాదమున పోరుతూన్నారా? మీ రెవరియాజ్ఞ బడసి యిట్లు మానగరులో కత్తులు దూసి నారు? అమాత్యమాధవాచార్యుడు అంతరించెనని ఇట్టి ఆగడ ములు మొదలుపెట్టినారా?...ఏమి రుద్రదామా, నీకూ మతి పోయిందా?

రుద్ర—(కత్తి రాజుగారి పాదములవద్ద నుంచి) మహా

ప్రభో, క్షమించండి- నేను మీదర్శనమునకు వస్తూండగా నన్ను నానాదుర్భాష లాడింది చాలక చంపెదనని ఈతడు కత్తిదూయగా ఆత్మరక్షణమునకు నేనూ దూయవలసివచ్చెను- తప్పు వీరవిజయునిది కాని నాది కాదు.

రాణి— తప్పెవరిదో స్పష్టమే!

రాజు— వీరవిజయా, ఇదివరకు నీవు మాప్రభుత్వమున కొనర్చిన అపరాధములు చాలవా? నేడు ప్రభువిశ్వాసియైన మా ఉద్యోగిపై కత్తి నెత్తెదవా? రుద్రదామా, ఏదీ మా యాజ్ఞ-వీరవిజయుని బంధింపుడు-

వీర— మహారాజా! నన్ను కొంచెము మాటలాడ నిండు-అమాత్యమాధవాచార్యుని పాదములు సాక్షిగా—

రాణి— బలేబలె! చచ్చినవారిపై ప్రమాణము సార్థకమా? అదీ కాక, అమాత్యుల ప్రాపు చూసుకొని మహారాజుగారియెడ ద్రోహ మొనరించుతూంటివి-ఇప్పుడా ఆటలు సాగవు-మీ అమాత్యు రాజుగారు సంహరించినారు లే!

రుద్ర— భటులారా! చూచెద రేమి? వాని కరవాల మూడబెరికి బందిశాలకు గొనిపొండు. (తీసుకొని పోదురు)

(అమాత్యమాధవుడు వచ్చును)

రుద్ర— (తెల్లపోయి తనలో) మరణించె ననిరి, పునర్జీవి ఎట్లయ్యెను? ఎంత మోసము!

రాణి— మాధవాచార్యులుగారే! మీ మరణవార్త మిథ్య యేనా?

మాధ—నేను బ్రతికియుండ నా మరణవార్త కథ్య మెట్లగును? దేవరవారికి నేను బ్రతికియుండడము సంతాప కారణమని తోచుచున్నది!

రాణి—మీరు బ్రతికియున్నారని చింతలేదు కాని మీ యశస్సు నిల్పుకోవలె ననే వ్యామోహముచేత స్వనిధనము గూర్చి అపోహము కల్పించి మమ్ము వంచించినందుకు కుందుచున్నాము.

అమా—నా మరణవార్త మీ కెరిగించిన దెవరు? మిమ్ము వంచించిన దెవరు? అంతా మీవారే...ఇది స్వల్ప విషయము. మహారాజా! నిరపరాధుల శిక్షించడము మీ బోటి న్యాయపరులకు భావ్యమా?

రాణి—(రాజుగారితో) నిబ్బరము చూపడాని కిదే సమయము.

రాజు—న్యాయాన్యాయ వివేచనయందు నేను యథేచ్ఛముగా ప్రవర్తించుతాను. శిక్షించు అధికారము నాది కదా?

మాధ—శిక్షించు అధికారమూ రక్షించు అధికారమూ మీవే. ప్రభూ! మిథ్యాపరాధము లారోపించి విశ్వాసపాత్రుడైన సర్దారును శిక్షించడము చూస్తే మీ స్వబుద్ధికన్న దురుపదేశకుల ప్రభావము హెచ్చుగా కనబడుతూన్నది- మీ సరళత నాధారము చేసుకొని మిమ్ము చుట్టియున్న కుటిలమండలి మీకీర్తికి మచ్చ తెస్తూన్నదని మనవిచేయ సాహసిస్తూన్నాను. ఒకవేళ వీరవిజయుడేదైనా అపరాధము

చేసెనని మీరా లించితే దానికి ముఖ్యకారకు లెవరో రుద్ర దాము నడిగితే తెలిపోవును. నిజ మెరిగిన వాడను కావున నేను వీరవిజయుని క్షమింపుడని వేడుకొనుచున్నాను.

రాజు—విద్రోహిని క్షమింపజాలను. మీరు నన్ను నిర్బంధించవద్దు... అమాత్యవర్యా! మీరు గతించిన ట్లపోహము కల్పించిన కపటచర్యకు సమాధాన మేమి?

మాధ—ఈ కపటచర్యకు బాధ్యుడను నేను గాను. మీ బంధుకోటి లోనివారి చాతుర్యమే అట్లు పరిణమించినది. ఇంతే కాదు-నిన్న రాత్రి నా హోమశాలను కొందరు ఘాతకులు చుట్టవేసి నన్నరికట్టినారు-అది ప్రభువుగారికి నివేదింపబడలేదు కాబోలు.

రుద్ర—తెలియుటకేమి? ఆ విషయము నప్పుడే విమర్శించి భీమసింహునికి చెరవిధించినారు. ఆ సందర్భముననే వీరవిజయుని కూడా మహారాజగారు దండించినారు. దీనిబట్టి మీపట్ల వారెంత జాగరూకత వహించినారో విశదము కాగలదు.

మాధ—అటులనా? భీమసింహుని దండించిన న్యాయాధిపతులు కూలంకషముగా విద్రోహ శేషము సంశయముందింపలేదే! భీమసింహుడు కేవల భృత్యుడు, వాని యజమాని ప్రచ్ఛన్న రాజభక్త వేషమున ప్రభువువారి చెంత స్వేచ్ఛగా నున్నాడే!

రుద్ర—అమాత్యవర్యా! మీకు ప్రతిస్పర్థులగు నభ్యు

ల్పై లేనిపోని నేరములు కల్పించి, వారిని రాజపోషకవర్గము నుండి తొలగించుటయందు మీారతి నిపుణులని లోకమెరుగును.

రాణి—మహారాజుగారి కావిషయమున గల సందేహ మిప్పుడు తీరియుండును.

మాధ—నాకు ప్రతిస్పర్ధు లున్నారని నే నెరుగను-అమాత్యుడనై కేవల రాజ్యక్షేమంకరములయిన పనులే సల్పుతూన్నాను కాని ఇతర మెరుగను. అమాత్యపదవియైనా నేను కోరి పుచ్చుకొనలేదని మహారాజుగా రెరుగుదురు-అధికారలాలసకుల వారికి ప్రతిస్పర్ధు లుందురేకాని సన్యాస దీక్ష వహింప నెంచువారి కధికారముతో నేమి ప్రసక్తి?

రాజు—మీా రాజభక్తి జగద్విదితమే కాని పదేపదే దానిని మాయెదుట ప్రశంసించడము అహంకారము కాదా?

రాణి—మహారాజుగారి కందరూ భృత్యులే, వారి కందరి స్వభావమూ విదితమే-అధికార మొసంగడమూ అది తొలగించడమూ రాజుగారి యిష్టమందున్నది.

మాధ—నిజమే-అధికార మొసగునప్పుడు పాత్రాపాత్రవిచక్షణ నిష్పక్షపాతబుద్ధితో చేయవలసిన కార్యము; మహారాజుగారు నిరభ్యంతరముగా దాని నిర్వర్తింపవచ్చును. నిస్స్పృహులైన వారియెడ రాజదండన నిరర్థకము-నా అధికారము తొలగించడానికి వారు శక్తులే కాని నా రాజభక్తిని దేశభక్తిని నిరసించుటకు వారి కధికారము లేదు-కుటిలుల బోధనలవల్ల వారట్లు కావించినా భావి ఇతిహాసకారులే

ఇందలి న్యాయము పరిశీలించగలరు.

రాణి—న్యాయ నిర్ణయమునకు దేశకాలములు లేవా! అమాత్యులవారికీమాత్ర మెరుంగరా?

మాధ—మహారాజుగారెచ్చట నుంటే అదే న్యాయమందిరము. అంతఃపురమున కేగిన పిమ్మట కూళల దుర్బోధనలకు చెవియొగ్గి వారి ప్రేరేపణచే న్యాయవిమర్శ చేయడానికసమర్థులౌదురు. ప్రతిపక్షి ఎదుట నుండెనా, అసత్యములకూ అప్రమాణములకూ వీలుండదు.

రాణి—న్యాయవిచక్షణ గూర్చి అమాత్యులవారికింత బాధ్యత అనవసరము. సభామందిరమునకు వచ్చి అభియోగమును దృష్టాంతీకరించితే న్యాయవిమర్శనకు తగిన వీలుండును. రండి, నాథా, పోదము.

(అమాత్యుడు తప్ప అందరూ పోవుదురు)

(హంసేశ్వరి వచ్చును)

మాధ—బిడ్డా! నీ వేల వచ్చినావు? ఇంటికి పొమ్ము.

హంసే—ఇంటిలో నా కేమున్నది?...వీరవిజయుని చెరలో పెట్టినారట నిజమేనా?

మాధ—(చింతాగ్రస్తుడై నిలుచును.)

హంసే—మీరు మాటాడక పోయినా మీ వైఖరి చూస్తే నాన్నగారూ, ఇక నేను జీవించిన ఫలములేదు. అయ్యో! మీ కళ్ళయెదుట ఆతని చెరలో బెట్టినారా? ఏమి చెడుదినములు వచ్చినవి! సర్వశక్తులైన మీ కాతని సంకటము

తొలగింప సామర్థ్యము లేకపోయెనా? అమాత్యప్రతాప సూర్యు డస్తమించెనా?

మాధ—తాలిమి వహించుమ్మా-నిరాశ పడకు-నీవు వీరవిజయుని పత్నివనీ, అమాత్యమాధవుని పుత్రి వనీ, నే నెరుగక పోలేదు, కాతరము వద్దు.

హంసే—నేను మీ కూతురి నన్నమాట నిజమే కాని మీ రమాత్యమాధవు లేనా? మీ తేజస్సు, మీ ప్రభావము నే డెందు కుపచరించలేదు?-నా దౌర్భాగ్యమా? లేక కాలవైపరీత్యమా?

మాధ—ఇది కాలవైపరీత్యమే. నీ వన్నట్లు ప్రతాప సూర్యు డస్తమించ లేదు, కాని కుతంత్ర మేఘ మావరించి నది. క్షణమాత్రము మహారాజుగారి న్యాయబుద్ధి కుచక్రోప దేశవ్యామోహమున భ్రాంతమైనది కాని శారదాభ్రముల వలె అచిరకాలమున నది శకలిత మవును. దీప మారిపోవున ప్పుడొక్కసారి పెద్దవెల్గు దోచునట్లు వారి పాపము పండి ప్రతిభ అంతటా వ్యాపించియుండి. ఇది క్షణికమనినమ్మి. లకోటా నాచేత పడగానే ఆ తేజ మారిపోవును, మేఘములు పటాపంచ మవును, అప్పుడు తిరిగీ మన రేఖ బయలుపడును. ప్రస్తుత పరి స్థితులలో మనము తెలవంచుకొని యుండవలసినదే, చింతించిన ఫలము లేదు.

(రుద్రదాముడు వచ్చును.)

రుద్ర—అమాత్యరాజా! మీరూ హంసేశ్వరిన్నీ

ఒక్కచోట నుండడము మేలైనది.

మాధ—కారణము?

రుద్ర—రాకుమారి హంసేశ్వరి నిప్పుడే సురక్షిత ముగా రాజప్రాసాదమును చేర్చుమని మహారాజుగారు నా కాజ్ఞాపించినారు.

హంసే—అమ్మో! నా కేమి దారి? (అసూత్యుని కౌగలించును.)

మాధ—రుద్రదామా, నీకు ప్రియతమమగుయున పనే విధింపబడింది. కాని మీ ప్రశ్రమ విఫలమని చెప్పవలసివచ్చెకదా అని చింతిస్తూన్నాను. హంసేశ్వరి నావద్ద సురక్షితముగా నుందని వారితో మనవిచేయుము-ఆమె దిక్కులేనిదైనా నా కంఠ ములో నూపిరి యుండునంత కాలము ఆమెను తేరిచూడ డానికి ఎవరి తరమూ కాదని చెప్పు-నా హృదయమందిరమున వెలసిన అచలదేవీ విగ్రహము నిశ్చింతతో ఉందని వారితో మనవిచేయుము.

రుద్ర—అలాగే చెప్పెదను కాని అయ్యా, నేడు వా రతిక్రోధావిష్టులై యున్నారు!

హంసే—నాన్నగారూ! నన్ను రక్షించండి-వారి చెం తకు పంపడము కన్న నన్ను యమపురికి పంపడము శ్రేయము- (మూర్ఛ)

మాధ—చూచితివా రుద్రదామా? భయవ్యాకులి తయై ఈమె ఎట్లు మూర్ఛిల్లిందో! ఇది చూడగానే దీని

తండ్రియెడ నాకుండిన స్నేహమూ ఆతనికి నేను చేసిన వాగ్దానమూ జ్ఞప్తికి వస్తూన్నవి. (కన్నీరు తుడిచి) మమత కడు చెడ్డది. నాజీవితములో నెల్ల నాకంట నీరొల్కిన దిప్పుడే!

రుద్ర—నీను వాత్సల్య మతి ప్రశంసనీయము, కాని మహారాజుగారి ఆజ్ఞానిర్వహణము నాకు విధి. నేను మీ శ్రేయస్సు కోరి చెప్పుతూన్నాను-మహారాజుగారికి కపరిమిత కోపము వచ్చినది. వారి యాజ్ఞను మీ రుల్లంఘించుట గని వా రేమిచేయుదురో అని శంకిస్తూన్నాను-మహారాజుగారు హంసేశ్వరికి పితృతుల్యులు. వారికడ నున్న ఆమె కెట్టి ఆపదా ఘటిల్లుతుందని తోచదు.

హంసే—(కళ్ళు విప్పి) అమ్మో! ఇంకా యితడిక్కడే ఉన్నాడా?

మాధ—బేలా! నీ కెట్టి చింతా వద్దు...రుద్రదామా, ఇంకో సారి చెప్పుతూన్నాను. నీవు వచ్చినట్లే వెళ్ళు. హంసేశ్వరి రానంటూన్న దని చెప్పు. ఆమె నా రక్షణయందు సుఖముగా నుంది, కావున వే రాశ్రయ మామె కక్కరలేదను.

రుద్ర—సరే, నేను వెళ్ళడమున కేమి? మీ రీయాజ్ఞను చులకనగా చూస్తున్నారు. దీని పరిణామ మత్యంత భయావహ మవుతుందని నే నెరుగుదును కనుక చెప్పుతూన్నాను, ఆవెన్క చింతించిన ఫల ముండదు. అప్పుడెవరిని నిందించిన నేమిలాభము?

మాధ—నీ అధికప్రసంగ మిక చాలు-మా హితము నే నెరుగుదును, నీ కాచింత వద్దు; నీ గతిగూర్చి నీ వాలోచించుకో.

రుద్ర—అయ్యా! మీ శరీరమువలె మీ మానసమూ వార్ధకప్రభావమున వెల్గుతూన్నది-బుద్ధి కర్మానుసారిణి.

మాధ—నేను వృద్ధుడనే కానీ నాకన్న యువకులకే ముందు మరణ మాసన్నము కాగలదు. ఎంతో వ్యవధాన ముండదు.

రుద్ర—మంచిచెడ్డలు మానవుని చేతిలో నుండవు. ఎవరి నుదుట నేమి వ్రాసియున్నదో తెలియరాదు.






## మూడో అంకము

—— మొదటి రంగము. ——

(చెరసాలలో కాపరి, శాంభట్టు.)

చె॥ కా॥ —కొంచె మాగవయ్యా! నన్ను బాధిస్తా వేమి? చెరసాల అంటే సామాన్యపు టిల్లనుకొన్నావా? చరచర లోనికి పోవడమునకు వీలులేదు; ఉత్తరువులేక ఎవరూ గడపదాటి కాలుపెట్టరాదు; అట్లు చేస్తే అర్ధచంద్రప్రయోగాలే. ఇక్కడ కులము ప్రధానము కాదు హుకుము ప్రధానము, తెలిసిందా? అధ్యక్షుని పిలుస్తానుండు, వారొప్పుకుంటే నీవు లోనికి పోవచ్చును. (అతడు పోవును.)

శాంభ—ఈ పాచిక పారితే నే నదృష్టవంతుడనే. గురువుగారికి కావలసిన జాబు భీమసింహునివద్ద నున్నట్లు హాఘను చెప్పినాడు. ఏలాగైనా దానిని సంపాదించవలెను. హానుమచేతుల్లో పడితే వాడిరొట్టి నేతిలో పడుతుంది.

(అధ్యక్షుడూ చెరకాపరీ వత్తురు)

అధ్య—ఏమి శాంభట్టుగారూ! మీ కేమి కావలె? ఖైదియైన భీమసింహుని చూస్తారా?

శాంభ—సరేను! వానిని చూడడానికే వచ్చినాను.

అధ్య—అట్లే చేయవచ్చును. (శాంభట్టు బిగాన పోవును) ఆగండి-మీరు వ్రాయించి తెచ్చిన ఉత్తరు వేది?

శాంభ—ఉత్తరువా? ఎవరిది? ఎందుకూ?

అధ్య—ముఖ్యామాత్యుని ఉత్తరువు లేకుండా చెరసాలలోనికి పోరాదని మీరు రెరుగరా?

శాంభ—నోటి ఉత్తరువే-వ్రాసినది లేదు-

అధ్య—అదేనా మీరు కెవ రిచ్చినారు? నిజము చెప్పండి-

శాంభ—ఎవరా? ఇంతమాత్ర మెరుగరా? అమాత్య మాధవాచార్యులు గారు-వారి ముఖ్యశిష్యుడను నేను-

అధ్య—వారు నోటి ఉత్తరువు అంపరు-ఒక వేళ పంపినా మేము దాని నంగీకరించము.

శాంభ—ఏమి?

అధ్య—నిన్నటి దాకా వా రమాత్యులుకాని నేడు కారు-ఆ యధికార మిప్పుడు రుద్రిదాసగారమాత్యులవారిది.

శాంభ—మాధవాచార్యులవారి అధికారము వారి యావజ్జీవమూ సాగవలసినదని మీ రెరుగరా?

అధ్య—ఓయి పిచ్చిబాపడా! రాచకార్యములలో నిదర్శనములు పాతవి అధికారము క్రొత్తవి చెల్లుతూండును. అమాత్యముద్రదాముల వారి సంతకమూ మహారాజుగారిముద్ర ఉన్న ఉత్తరువు చూపించిన గాని ఎవరినీ చెరసాలలోనికి పో

నీయకూడదని మహారాజావారి యాజ్ఞ నా కిప్పుడే చేరింది. దానిముం దమాత్య మాధవాచారిగారి నోటికబు రేమి చెల్లుతుంది? నీవు గనుక ఇంతసేపు మాటలాడినాను, ఇంకొక రైతే అప్పుడే బైటకు పంపి యుందును.

శాంభ—(స్వ) ఉపాయములు నాలుగు:—సామ, దాన, భేద, దండములని శాస్త్రమం దుంది-వాటి నిప్పుడు ప్రయోగిస్తాను-(ప్ర) చూచినారా, సుబేదారు గారూ, మీ వోటి కర్తవ్యతత్పరుడైన అధికారి ఈ ఊళ్లో లేడని మీకు ఖ్యాతి కద్దు-తమరు కడు పరోపకారులు, కాబట్టి నా యందు దయయుంచి భీమసింహు నొక్క మారు కలిసి మాటాడ నివ్వండి.

అధ్య—కర్తవ్యపరుడనని నీవే స్తుతించి, అందుకు వ్యతిరేకముగా ప్రవర్తించుమని ఏలా గంటావయ్యా! ఇంక స్తుతిపాఠము మాని సీదారిని నీవు పో.

శాంభ—సామము సాగలేదు కావున దానముప్ర యోగిస్తాను-(పైకి) అట్లు కాదు-మిమ్ము నేను స్తుతించలేదు-న్యాయమే నే నన్నది-పోనీ ఇటు చూడండి-(మొహరుల సంచి యిచ్చి) ఇది పుచ్చుకోండి. ఇది అమాత్యులవారి హోమశాల లోనిది-అధికారులను చూడబోవునప్పుడు వట్టి చేతులతో పోరాదని శాస్త్రము. ఇది గురువుగారి ప్రసాదము గనుక పరమపవిత్రమైనది. చందురిన కొక నూలుపో గన్నట్లు మీరు దీని గ్రహించవలెను-

అధ్య—(కోపముతో) ఓరీ, బ్రహ్మచారీ, నీవంటి లోభి క్షుద్రుడూ ఐనవానివద్ద నీ ఆటలు సాగుతవి-నావద్ద వాటిని కట్టిపెట్టి వచ్చినదారిని పట్టు-నాకు లంచముచేసి నీ కార్యము సాధించుకోవలెనని యత్నిస్తూన్నావా?

శాంభ—(స్వ) ఈ ఉపాయమూ వ్యర్థమైనది-భేద మెట్లుపయోగించుతారో ఎరుగను-"దండం దశగుణం భవేత్" అన్నాడం (పైకి) అయ్యా! మంచిమాట లెన్ని చెప్పినా మీకు నామీద లక్ష్యము లేక పోయింది. ఇక నూరకుండను-నా బ్రహ్మదండము నభిమంత్రించి మీమీద ప్రయోగించితే అప్పుడు నామహత్తు మీకు తెలుస్తుంది. ఇదిగో పూచిక పుల్ల-దీని నభిమంత్రించినా నంటే బ్రహ్మాస్త్రమై ప్రపంచమూ తటిని భస్మీభూతము చేస్తుంది. జాగ్రత్త! ఇప్పుడేనా నా ప్రభావ మెరిగి నన్ను లోనికి పోనీయండి, లేకుంటే మా గురువుగా రుపదేశించిన మంత్రము పునశ్చరణ చేసితీరుతాను. దాని ఫలితము ఎంత ఘోరమో ఆలోచించుకోండి.

అధ్య—ఇతడు వట్టి మూర్ఖుడు-ఓయీ పిచ్చిబాప నయ్యా, ఇది కలికాలము-మీ నత్తా అణిగింది-ఇంక మాటాడకు-మాధవాచారిగారికి సంబంధించినవారి నెవ్వరినీ లోనికి విడువవద్దని నా కాజ్ఞ అయింది-నీవు వెళ్ళిపో-లేకుంటే గెంటి వేయించుతాను.

(చెరకాపరి వచ్చును)

చె॥ కా॥—అయ్యా-పదహారేళ్ళ వడుచు గుమ్మము

దరికి వచ్చింది-ఆమె భీమసింహుని చెల్లెలట, ఒకసారి తన అన్నను చూపుమని వేడుకొంటూన్నది. పాపము దాని దుఃఖము చూడలేక పోయినాను, లోనికి వదలకుంటే అక్కడే మరణించేటట్లున్నది.

అధ్య—రమ్మను-

(రుద్రదాము కొంగు పట్టుకొని స్త్రీ వచ్చును)

రుద్ర—(స్వ) ఇది భీమసింహుని చెల్లెలా-ఎంత రూపసి! నేను రాజకార్యమగ్నుడనై యున్నాను, గాని లేకున్న దీనిని వలలో వేసుకొందును. తన సోదరుని చూపుమని ప్రార్థేయపడుతూన్నది. (ప్ర) తరుణీ! నాకొంగు విడువుము, నీ కేమి కావలెను?

స్త్రీ—అయ్యా! మీరు రుద్రాయలూ సత్పురుషులలా గున్నారు-నే నొక పేదదానిని, అనాధను, నాకు సోదరుడు తప్ప వేరెవ్వరూ లేరు, అతడు కూడా మృత్యువు నోటిలో నున్నాడు! అతని నొకసారి చూచి పిమ్మట అసువులు విడిచెదను; మీరు రాజోద్యోగుల లాగున్నారు, తలచినచో నా అన్నను చూపగలరు; అదే నే కోరేది-

రుద్ర—బాలామణీ-ఊరడిల్లుము. నీ విషయము అధ్యక్షునితో చెప్పెదను-ఆపైని నీ అదృష్టము.

అధ్య—అమాత్యరాజా, ఒక మనవి-మీవద్ద మహారాజుగారి ముద్రాంకితమైన అనుజ్ఞ ఉన్నదా?

రుద్ర—నీ కెంత పొగరు! నే నెవడనో గుర్తున్నదా?

కారాగృహమున ప్రవేశించడానికి నా కొరకరియాజ్ఞ కావలెనా? ఆజ్ఞాపత్రిమట!

అధ్య—మన్నించండి--మహారాజుగారి ముద్రాంకిత మైన ఉత్తరువు చూపకుంటే ఎవరినీ లోనికి పోనీయరాదని మాకు కట్టడి యున్నది. మే మేమి చేయగలము?

రుద్ర—సరే-నీతో వితండవాదము సల్పుడము కాల హరణము-(ఉత్తరువిచ్చి) అదిగో చూడు ఉత్తరువు. నా వెంట నెందరినైనా తీసుకొని పోవచ్చునని ఉన్నది చూచినావా? ఇదిగో ఈస్త్రీని వెంట తీసుకొని పోతూన్నాను.

అధ్య—ఉత్తరువు మాకు చూపిన పిదప మూరు మా టాడను-(స్వ) ఈ రుద్రదాసుని చూచినప్పుడెల్లా నాకు పట్ట రాని కోపము వచ్చును. నేడు రాజాజ్ఞ వీడు తెచ్చినది మేలాయె, లేకున్న వీని దురహంకారము మట్టుపెట్టి యుం దును... కాని యీ సందడిలో నాకోర్కె ఈడేరింది. భీమసిం హుని చెల్లెలి నాతనివద్దకు పంపవలె ననుకొన్నాను, కాని రాజాజ్ఞ లేక అది వీలులేదు. పాపము! ఇకకొన్ని గడియ లలో చావనున్న సోదరుని చూడడానికి వీలు లేకపోయింది! పాప మాడది దర్బారులోనికి వెళ్ళడ మేలాగు? దానికి రాజాజ్ఞ లభించడ మేలాగు? కారాగారపద్ధతు లతికఠినములు! వాటిని గమనించ వలసినవాళ్ళు న్యాయాన్యాయ విచక్షణా, దయాదాక్షిణ్యములూ విడిచిపెట్టవలెను. సత్ప్రవృత్తి కొనసాగ డానికి సర్వేశ్వరు డేదో సదుపాయము కల్గిస్తూండును—

(చెll కాllతో) నీ విక్కడ కూర్చో. నేను చెరసాల పర్యవేక్షణ చేయడానికి పోవలెను. అగత్యమైన పని ఏ_స్తే తక్షణమే నాకు తెలియజేయుము. (పోవును)

(రుద్రదాముడూ స్త్రీయూ వత్తురు.)

రుద్రి—నా కిప్పుడు మంచిదినము లవుటచేతనే ఈ సుకుమారి, ఈ జగన్మోహనాంగి తనంతట తానే కైవసమయింది. దాని సోదరుడిక రెండు గడియల వాడు, అతడు తప్ప తన కిక దిక్కు లేదని ఈమె చెప్పింది కదా! సోదరుడు మరణించిన తర్వాత దీనికి దిక్కు నేనే కావలెనని దీని అభిప్రాయము. ఒకవేళ ఇది ఒప్పకున్నా దీనిని బలాత్కరి_స్తే నాకు ప్రతికూలముగా దీని మొరాలించు వాడెవడు!—సరే కాని, దీని నిప్పుడు భీమసింహుని దరికి పోనీయ గూడదు. ఆ లకోటా వాడు దీని కిచ్చునేమో? అది రహస్యమని ఎరిగినట్లయితే ఈమె నా కందనివ్వదు, తరువాత లేనిపోని మనోమనికితము లకు పీలు చిక్కును. అదీకాక భీమసింహునకూ నాకూ జరిగే సంభాషణ ఇది వినకూడదు. "షర్కర్ణో భిద్యతేమంత్రిః" కావున దీనిని వెలుపలనే ఉంచి నేను లోనికి పోయెదను; పిమ్మట సందర్భానుసారము నడుచుకో వచ్చును. (స్త్రీతో) నవలామణీ, నీ విక్కడనే ఉండు, భీమసింహుడు తక్కిన ఖైదీలతో కలిసి యుండును, వానిని వేర్పరచి నిన్ను కొనిపోతాను; ఇక్కడ నీ కేమీ భయ ముండదు. జడవకు.

స్త్రీ—చి_త్తము, మీ రొనర్చిన మేలు మరువను.

(అతడు పోవును) ఈ ద్రోహి లోనికేగి భీమసింహునితో నెట్లు వ్యవహారించునో ఈ ప్రక్కనుండి చూస్తూంటాను. ఒకవేళ వీడా లకోటాను కరగతము చేసుకోలేక చేతులు నలుపు కొంటూ వచ్చినా, ఏదైనా తంత్రము పన్ని భీమసింహునుండి దానిని పుచ్చుకోవలెను. అది వీడిచేతనే చిక్కినా, ఈ సందు అంధకార బంధురము, నిర్మానుష్యము. వీనివద్ద నాయుధ మేదీ లేదు. వీడు నన్ను తప్పించుకోలేడు!

(రుద్రదాసూ భీమసింహుడూ వత్తురు.)

భీమ—ఓరీ దుష్టా, క్రూరా, ఘాతకా, మాధవాచా చార్యుని పరిమార్చి నీకు సంతసము చేకూర్చి ఆవార్త మొట్ట మొదట చెప్పినందుకు నాకు నీవిచ్చిన పారితోషికము కారావాసమా?

రుద్ర—మూర్ఖుడా, మాధవాచార్యులు నుడిసియున్న నీ కీగతి పట్టియుండదు.

భీమ—ఏమీ మాధవాచార్యుడు చావలేదా?

రుద్ర—లేదు.

భీమ—మంచముపైనున్న శవమును కళ్ళారా చూచి నానే?

రుద్ర—అది జీవచ్ఛవము, మరణించలేదు; వీరవిజ యుడు నిన్ను మోసగించెను. నీమాట నమ్మి మాధవాచా ర్యుడు మరణించెనని మేము చాటితిమి-ఆగోల అణగక ముందే అమాత్యుడు ప్రత్యక్షమైనాడు!

భీమ—(నిరాశతో) ఇప్పుడు చేయవలసిం దేమిటి?

రుద్ర—వీరవిజయుడు నీకొప్పగించిన లకోటా నాకిస్తే వాని నీకు తోడుచేస్తాను. ఇద్ద రైదైనా ఆలోచించ వచ్చును.

భీమ—అమ్మో! ద్రోహిని నిన్ను నమ్ముతానా?

రుద్ర—అది నీదగ్గర నుంచుతానా? తీసుకోక తప్పను.

భీమ—నీకు నాదిని చిక్కనివ్వను.

రుద్ర—(భీమసింహునిపై బడి కత్తితో పొడిచి లకోటా తీసుకొనును)

స్త్రీ—మంచిపని జరిగింది... రుద్రదాము చేతిలో చిక్కిం దాజాబు, వాడు నాదగ్గరకు వచ్చినతోడనే నేను నావని నిర్వహించి తీసుకొంటాను.

(రుద్రదాముని కత్తితో పొడిచి లకోటా గొనును.)

---

## —॥ రెండో రంగము. ॥—

---

(రాజభవనమున రుద్రదాముడు)

రుద్ర—ఈ లకోటా నన్ను పిశాచములాగు బాధిస్తూంది. ఎంతో పరిశ్రమపడి భీమసింహుని వద్దనుండి బలాత్కారముగా సంపాదించినాను, కాని పసివాని చేతిలో మాంసపు ముక్క పక్షి తన్నుకొని పోయినట్లు ఒక క్షణములో ఆమాయావిని ఎత్తుకొని పోయింది- అప్పటిగాయము మానలేదు. మాధవాచారి రేపు సన్యసించి ఈయూరు వదలి పోవు

నట, అప్పుడు నే నమాత్యుడ నౌతాను. ఇట్టి లకోటాలు లక్షైనా నన్ను బాధించలేవు. అబ్బా! ఈ గాయము నన్ను చాలా బాధిస్తూన్నది...ఆస్త్రీ ఎవర్తె? జాబు పెట్టుకొన్నప్పు డది "ఓరీ ద్రోహీ! నాసోదరుని చంపజూచెదవా? అందుకీ బహుమతి గొనుము"ని పోటు పొడిచింది-ఆ మాటలు కందిరీగ రొదవలె నా చెవులలో మోగుతూన్నవి-అది నిజముగా భీమసింహుని చెల్లెలైతే లకోటా గురించి చింతలేదు. దానిని విప్పి తన సోదరునికీ దానికీ ఎట్టి సంబంధమూ లేదని గ్రహించి వెంటనే చించివేయును...ఆహా! ఏమి దాని యందము! అందకత్తె లందరూ ఘాతుకబుద్ధి కలవాళ్లు కావుననే "భార్యా రూపవతీ శత్రుః" అన్నారు-ఇక నట్టివాళ్ళ నాసించగూడదని ఒట్టు పెట్టుకుంటాను. (హంసేశ్వరి వచ్చును)...ఆఁ ఇదుగో హంసేశ్వరి! ఛీ ఛీ ఒట్టులేదు గిట్టులేదు...ఔను, ఘాతకులగు అందకత్తెలను కామించకూడదు, నిజమే-కాని హంసేశ్వరి అట్టిది కాదే! మహారాజుగారి యాజ్ఞానుసారము తోడ్తేవడమునకు నేను పోయినప్పుడు ఈమె నన్ను చూచి భయపడ్డది. అమాత్యుడు దగ్గర నుండగా నాపై మోహము వ్యక్తపరుచుటకు అది తగిన సమయమా? కాదు— ఇప్పుడు వాని కళ్ళలో దుమ్ముగొట్టి నన్ను చూడ వచ్చినది! ఏమైనా నేను కొంచెము బెట్టుగానే ఉంటాను.

హంసే—మహారాజుగా రిక్కడున్నారని సేవకులు చెప్పినారు, వా రిట లేరు; పోయి వెతకుతాను.

రుద్ర—(అడ్డము నిల్చి) వారి నన్వేషించే శ్రమ నీ కేల? వారి దర్శనము కావలెనా?

హంసే—ఔను. నాకు వారితో పని ఉన్నది.

రుద్ర—ఉండవచ్చును, కాని రాజుగారిని చూడదల చువాళ్ళు వారి ప్రతినిధి ద్వారా మహారాజుగారిని సందర్శించ వలెనని నీ వెరుగవా? ప్రతి ఫిర్యాదును మహారాజుగారే విమ ర్శించడానికి వీలుంటుందా? అట్లు తామే అన్ని కార్యములూ నిర్వహిస్తే ప్రతినిధు లుండి ప్రయోజన మేమి? నీపని ఎట్టిదో నాకు తెల్పితే నీ రాక వారికి నే నెరిగించుతాను. మహా రాజుగారి ప్రధానిని కావున గౌరవనీయులైన వారి రాక నేనే ఎరిగింతును.

హంసే—మహారాజుగారే నాకు కబురంపినారు.

రుద్ర—సరే-వారిక్కడ లేరు కావున వారి కార్యము లను నిర్వహించవలసినవాడను నేను. నీకు వారితో నున్న పని రాజకీయ వ్యవహారములకు చెందినట్టైతే, అపరాధి కేమి శిక్ష విధించవలెనో నేనే తొలుత విమర్శించవలెను.

హంసే—రుద్రదామా—

రుద్ర—(స్వ) తోవకు వచ్చింది. ఈమె ప్రేమజ్యోతి ప్రకాశము శాశ్వతముగా నాయందే కేంద్రీకృత మవునట్లు చేసుకోవలయును.

హంసే— రుద్రదామా!

రుద్ర—హంసేశ్వరీ! ఏమందువు? రాజ్యాధికారము

ననుసరించి నిన్ను పరుషము లాడవలసి వచ్చినది! నన్ను మన్నింపుము. నీవిషయమున నీవు చెప్పుకొనుదానిని కూలంకషముగా విమర్శించి న్యాయ నిర్ణయము చేయువలసిందని రాజాజ్ఞ. న్యాయ నిరూపణము అతికష్టముతో కూడిన పని— మహారాజుగారు వృద్ధులు, కోమలాంతఃకరణులు; విన్నపము చేసేది కులీనయగు కోమలాంగి, ఆమె ప్రియుతము చేసర్చిన అపరాధము సామాన్యము కాదు. అందుచేత న్యాయనిర్ణయము అతి సూక్ష్మము; ప్రతివిధి ఆలోచన లేకుండా రాజుగారు విమర్శించదగినది కాదు.

హంసే—ప్రధానిగారు మానవకోటిలోనివారు గనుక వారికీ దయ, దాక్షిణ్యము, కరుణ ఉండును గదా. కేవల న్యాయనిర్ణయము ప్రధానముగా నెంచక కొంచెము దాక్షిణ్యము చూపవలసినదని వారిని వేడుకొనడము వృథా కాదు. కావున ప్రధాని గారూ—

రుద్ర—హంసేశ్వరీ, బహుమానాస్పదమైనా విరసమైన రీతిని నీవు సంబోధించుతూన్నావు. నన్నేమి చేయుమందువు?

హంసే—అయ్యా, ఉద్యోగధర్మముచేత తమరు ప్రధానులవుటే కాక వీరవిజయునికి మీరు ప్రధానమిత్రులు కారా?

రుద్ర—హంసేశ్వరీ, నిజమది కాదు-ఒకానొకప్పుడు నే నతని మిత్రుడనే కాని ప్రకృతమున కాను.

హంసే—ఇంత నిష్ఠురముగా పల్కుతూన్నారేమి?

రుద్ర—చక్కగా ఆలోచించితి వేని నీకే విశదము కాగలదు.

హంసే—అజ్ఞానురాలను, వ్యాకులత చేత వ్యగ్ర మనస్కురాలను; నాకు మీ గూఢ వాక్యము లర్థము కాలేదు. మీరే తెల్పుడు.

రుద్ర—ఇందు గూఢార్థము లేదు-వీరవిజయునితో నాకు పూర్వము గాఢమైత్రి యుండేది.

హంసే—ఇప్పు డది లేదా? కారణ మేమి?

రుద్ర—లేదు-నీయందలి అనురాగమే కారణము.

హంసే—అతనికి నాపై ననురాగమున్న మీకేమి?

రుద్ర—నాకూ అనురాగమున్నది.

హంసే—నాయందు మీ కనురాగమా?

రుద్ర—అనురాగమే కాదు-నిన్ను ప్రేమించునట్లు నే నెవరినీ ప్రేమించలేను-ఇక ప్రేమింప బోను-నా కేక లక్ష్యము నీవే! నా పంచప్రాణములకూ నీవే అధారము. ఈ సంగతి నీవూ గుర్తించి యుండవచ్చును.

హంసే—కట్టా! ఈ దుష్టుడు నా ఆపద సదనుగా చేసుకొని కర్ణశూలములగుమాట లంటున్నాడు! ఏమి బదులు చెప్పడానికీ తోచకున్నది.

రుద్ర—మాటలాడ వేమి? నీయెడ నిటీవల నే నవలంబించిన వాక్యసరిణి, వర్తనము, నిన్ను కైవసము చేసు

కొనుటకై నేను చేస్తూన్న పిశ్వప్రయత్నము లన్నిటికీ మూల మంత్ర మా ప్రేమయే కాని అన్యము కాదు-ఇది నీవు గ్రహించియుండుము.

హంసే—అయ్యా, కొద్ది దినములనుండి నాకు మతి పోయినది-నే నెట్లు సంచరిస్తూన్నానో నాకే తెలియలేదు. చింతాంబుధిని మునిగి యుండడముచేత నాకు జ్ఞాపకశక్తి కూడా నశించినది- నా జీవితమంతా భ్రాంతమై యున్నది- మిమ్ము శరణు వేడెదను-ఆపన్నురాలిపై కటాక్షించరా?

రుద్ర—వద్దు-హంసేశ్వరీ-వద్దు. నీ మనస్సు వ్యాకులిత మైతే నాకు పురుషార్థసాధనము పూజ్య మవును. మహారాజుగారి పరివారమునకు చెందిన నీ బోటి రాజసదన దుఃఖ భాజన మయుందంటే మాబోటివా రుండిన నేమి? మండిన నేమి? రాకుమారీ, రేరాజు తేజము కూడా నీయెదుట వెల్లబారును-కృష్ణసర్పము నాగస్వరము నాలించి తదేకాగ్రతతో వివశమైనట్లు నీసందర్శనము లభించిన తోడనే అధికారజ్ఞాన మంతా మరచిపోయి నీచరణములపై వాలి నేనే నీశరణు జొచ్చినాను. నిన్ను చూచినతోడనే నా చిత్తము పరవశ మయింది, ప్రేమోన్మాదినై యున్న నాపై కృపవహించుము. నీకు వీరవిజయునిపై ప్రేమఉన్నదని ఎరుగుదును. ఆత్మ శ్లాఘనమని యెంచకు. వీరవిజయునికి నే నేవిషయమున తీసిపోతాను? నేనూ కులీనుడను, శూరుడను, ఉద్యోగిని-ప్రస్తుతమున లతడు ఖైది, ఆసన్న మరణుడు-ఒకవేళ నీయందలి

మమతచేత మహారాజుగా రతని చంపకున్నా కారాబంధము తప్పదు కదా? అట్టి వానిని నీవు కట్టుకొనడ మేలాగు? కట్టుకొన్నా ఏమి సుఖము బావుకొందువు?...నాసంగతి కొంత పరీక్షించు-మహారాజుగారికి పరమాదరపాత్రుడ నౌటయే కాక ప్రధానామాత్యుడను-ఖ్యాతికి కొదవ లేదు, ఐశ్వర్యము నకు అంతము లేదు.

హంసే—రుద్రదాముగారూ, దైవవశమున నేడు మీ కైశ్వర్యము లభించినందుకు సంతసించవలసినదే, కాని అత్యం చంచల-ఏక్షణమున కెవరిపై ఆమె కన్ను వేసునో తెలి యదు-ఈ ఐశ్వర్యము శాశ్వతమా?

రుద్ర—పోసీ-శాశ్వతమైన ఐశ్వర్యమేదో చెప్పు. వివే కవతీ, దానిని సంపాదించు యత్నము చేసెదను.

హంసే—కీర్తి శాశ్వతము-పరోపకారము దానికి మూలకారణము. నా కిప్పుడు కావలసినది వీరవిజయుని విడు దల, ఆతని ప్రాణములు దక్కితే అదే నాకు సకలైశ్వర్య ములు. నా జీవితమునకు పరమ నిధాన మాతడే.

రుద్ర—సరే-అతని ప్రాణములు కాపాడడము నీచేతి లో నుంది. నీ విట్లు చింతింపవలదు. ఆతని ప్రాణములు నా చేత నున్నవి. మహారాజుగారు మాటవరుసకే ప్రభువులు గాని రాజ్యమంతా నడుపు సూత్రములు నాచేత నున్నవి. నీ పాణిగ్రహణమునకు నాకు సెల వొసగినట్లైతే ఉత్తరక్షణ

మందు వీరవిజయునికి విడుదల ప్రసాదింతును...ఇవన్నీ ఉన్మత్త వాక్యములని ఎంచకు. వీరవిజయుని చెరలో పెట్టించినది నేనే-పాపము! మహారాజుగారు నాచేతిలోని కీలుబొమ్మ, నే నెట్లాడించిన అట్లాడుతారు. పంజరము మూసినవాడే దానిని తెరువగలడు-ఇందలి యాథార్థ్యమిది-ఆలోచించుకో.

హంసే—ఓరీ దుష్టా, నీచా, నీ గహనాంతఃకరణమున నిమిడియున్న కాలకూటమును ఆత్మశ్లాఘనోన్మాదమున స్వయముగానే కక్కినావు! అవకతవక రాజు, అవివేకప్రధాని-మీ యిద్దరికీ జోడు కుదిరింది-ఓరీ పాపీ, నరాధమా, ప్రధానివైనందుకు నీకు నరకమే ధృవము. నీ విప్పు డొప్పుకొన్న అపరాధసంచయమూ, నీ ధృష్టత, నీకులబిరుసూ, ఆగడమూ మహారాజుగారి కెరిగించి ని న్నుద్యోగమునుండి ఊడ బెరికెదను. మిత్రద్రోహివి, నీ వొకక్షణములో రాజద్రోహివి కాలేవా? నీ చేతిలోని కీలుబొమ్మకు చైతన్యము కలుగ జేసెదను. నీవే పౌరుషముగల బంటువేని ఇప్పుడు నీ వేకరువు పెట్టిన దంతా రాజుగారి ఎదుట ఒప్పుకొనుము.

రుద్ర—ఓసీ జేలా! నీ యందలి మోహమున నీకు నా అంతరంగము వ్యక్తపరిచితిని. అమాత్యుడనై నిన్ను నా సర్వస్వముగా నెంచుతూంటిని కావున అరమరలేక అన్ని విషయములూ ఎరిగించినాను. నీవు నాకు ప్రతికూలవై నన్ను శిక్షింతువా? నీ వెంత చతురవైనా నీకన్న వయసున పెద్ద వాడను, అనుభవశాలిని, కావున నీచేత వంచింపబడునంత

అవివేకిని కాను-నామాటలు మహారాజుగారి కెరిగింతువా! కానీ—ఇంతతోనే బెదరుదు ననుకొంటివా? ఇవే కాదు అతు నేరములు నాపై మోపు. సూర్యోదయము కాగానే పొగ మంచుబిందువులు అదృశ్యమైనట్లు నే నొక్క మాటతో వాటి నన్నిటినీ అంతరింపచేయగలను. అబ్బో! ఈపాటి గడుసు తనము లేకున్న అమాత్యపదవి నెట్లధిరోహించినాను!... కాని హంసేశ్వరీ! మన తగ వింతతో తీరదు-ఇదిగో కాగితము చూడు-దీనిపై సిరాతో వ్రాసిన అక్షరము లున్నవే, ఇవి వీరవిజయుని రక్తముతో దిద్దబడును-మహారాజుగారు వీరవిజయుని క్షమింతురని నీకాశ యున్నది కాబోలు-ఆ కొరత కూడా తీరనీ. నీవు రాజుగారిదగ్గర నామాటలు చెప్పుతూండగానే వీరవిజయుడు పరలోకప్రయాణోన్ముఖు డగును-మహారాజుగారు కాదు కదా మహేశుడైనా దీని తప్పించ నేరడు.

హంసే—(బిగ్గరగా) మహారాజా! నేను మీ కూతు రను, రక్షించండి! రక్షించండి!

రుద్ర—ఏమి నీ అవివేకము? అంతఃపురమున నున్న మహారాజుగారు నీకేక విని పరుగెత్తి వత్తు రనుకొన్నావా? ఈ పరిదేవన మిక చాలించి నామాట విను. నేను చేసేది రాజుగారి కసమ్మతమైతే నా కట్టి యధికార మిచ్చియుం దురా?...నీవు చక్కగా ఆలోచించు-నన్ను చేపట్టి వీరవిజ యుని బ్రతికించెదవా? లేక నన్ను ధిక్కరించి అతని ప్రాణ

ములు హరింతువా?

హంసే—అధమా! ని న్నింతదాకా వ్యర్థముగా దేవురించినాను, కాని నీ నైజము నిన్ను బాయలేదు. నాప్రియుని ప్రాణములు నిన్ను నేను యాచించగా నన్నునీవు మోహించి నావా? మహారాజుగారు అమాత్యపదవిని నీ కొసగిరి కాని అందుకు తగిన ఔదార్యము నొసగలేకపోయినారు. నీ యధి కారము నీవే సాగించుకో-మా ఉభయుల ప్రాణములను నీకు బలివేసెదము-ఈ భూతలమున మే మొండొరుల ప్రేమిం చుకొని సుఖావాసము చేయవలెనని మా నొసట వ్రాసియుం డక పోతే మృతినొంది స్వర్గమున మే మత్యనుఖ మనుభ వించ గలము. ఆలోకము నీ కగమ్యము, కావున అచ్చట నీ వంతరాయము కల్పించ నేరవు.

రుద్ర—మోహనాంగీ, చిన్నదానవు-పరలోక చింత నాశించి ఇహసౌఖ్యము చెడగొట్టు కొందువా? నాబోటి పరాక్రమశాలి చేపట్టిన నీకు రాజ్య మబ్బుట కూడా అసం భవము కాదు-ఇప్పుడే నున్నా రాజద్రోహ మానని శంకించు తూన్నాను-నీవే ఊహించుకో-వలసివచ్చినసిరిని వదలు కొనకు. నీవు న న్నిప్పుడు తూలనాడినావని నాకు కోపము లేదు-ఒక్క సారి నీ దరహాసచంద్రిక వెల్గినదా ఈ యువమానాంధకారము నామూవ శేమమవును?

హంసే—నీప్రలాపము మానవా? నీచా! నీ మూర్ఖత విడువవా? నరే

రుద్ర—ఎవడు గా అక్కడ! ఖైదీని తెండి.

(వీరవిజయుని కొని వత్తురు)

ఇదే వీరవిజయుని గాంచుము. (హంసేశ్వరి వీరవిజయుని చెంతకు పో బోవును) ఆగు! ఆగు! దూరాన నుండియే మాటలాడుకోండి-వాని ప్రాణములు దక్కింతువా, దక్కించవా?

హంసే—హా నాథా! ఎంత అశక్తుల మైతిమి!

వీర—ప్రేయసీ! దుఃఖింపకు-అమాత్యమాధవాచార్యుల ప్రభావ మింకా మొక్కవోలేదు. మన దుర్విపాకము మూలాన ఆలాగు సంభవించినా చింతలేదు. అన్యోన్యప్రేమ నోలలాడుతూ సుఖముగా ఉసురుల బాయుదము. ప్రేమకన్న ప్రాణము లధికములా?

రుద్ర—మూర్ఖా! చావు మేలని ఎంచితే నీవు చావవచ్చును కాని ఈ తన్వీమణి తనవు తొందరగ నేల?

వీర—ఓరీ అధమాధమా! నిన్ను చూడడమూ నీతో ప్రసంగించడమూ పాపహేతువులు, నీవు తలంపునకు వచ్చిన క్షణము సచేలస్నాన మాచరించవలెను. అన్యాయపరుడైన రాజుకు పాపపరాయణుడవైన ప్రధానివై బ్రతికి యున్నన్నాళ్ళు నీ యధికారము సాగించుకో. మా ప్రేమ జోలి నీ కెందుకు?

రుద్ర—బిచ్చానికి వెడలినా బిరుసు తగ్గలేదే! అదీ అంతమయ్యే కాల మాసన్న మయింది. నీ బోటి పొగరు

బోతుల బిగువు తగ్గించే యంత్రము లింకా నీకు పరిచితములు కాలేదు. అందుచేతనే బీరము లాడుతూన్నావు.

వీర—చిత్రవధ చేసే యంత్రముల యంత్రణ ఏపాటి? వీటికన్న దుర్భరమైన సూక్ష్మయంత్రము మన స్సోకటున్నది దాని యంత్రణ నిర్భరము! అది మా కంటను. నీ కీ రెండు యంత్రణములూ అనుభూతములు కాగలవు, కొద్దికాల మోపిక పట్టు-వెన్నెలరాత్రులు శాశ్వతము కావు, వెలుగు వెంటనే చీకటి వచ్చును. అప్పు డుత్కటమైన పాపఫల మనుభవించక నీకు తీరదు.

రుద్ర—చేతులూ కాళ్ళూ కట్టబడియున్నవి; నీ నోటికి తలుపూ ద్వారబంధమూ లేదు, నీ యిచ్చవచ్చినట్లు పేలుము. నీ దురుక్తులూ శాపములూ నాకు కొంచెమైనా వింతగా తోచలేదు. చచ్చేవాని నోరు నొక్కనేల? వదరుబోతు కెదురు రాదగదు. వీనిని భటులారా, తీసుకొనిపోయి అధ్యక్షునకీఆజ్ఞా పత్రమునంద చేసి శిరచ్ఛేదమునకు తగిన ఏర్పాటులు కావించుమనండి.

(ఆజ్ఞాపత్రము నివ్వబోవును)

హంసే—అయ్యో! నా కిక దిక్కెవరు? కన్నతండ్రి లేదు. పెంచినతండ్రికి ప్రేమలేదు-అమాత్యమాధవు లవమానగ్రస్తులయినారు. ఈదురాత్ముని దుస్తంత్ర మనర్గళముగా సాగుతూన్నది-వీని మనసు రాయికన్న గట్టిది-కోరరాని

కోర్కె కోరుతూన్నాను-నన్ను రక్షించువారు లేరా? హా దైవమా!

(అనూత్యమాధవుడు వచ్చును)

మాధ—మోహాసక్తులకు వివేక ముండదు, మొట్టి కాదుతోనే మత్తుతగ్గును. (హంసేశ్వరితో)అమ్మా, దినములు వంకరై నప్పుడు దేవుడే రక్షింపడు, ఇక మానవు డేమిచేయ గలడు? నే నొక బిచ్చగాడన, బలహీనుడను, వృద్ధుడను. వీరవిజయుని మృత్యువు నోటినుండి తప్పించగలనా? అధికార మంతరించడముచేత నీవలెనే సర్వేశ్వరుని ప్రార్థించవలసిన వాడనే! మనపాలిటి దైవము మన యెదుటనే ఉన్నాడు. ఈతడు వర మివ్వకున్న స్వర్గమందలి దేవుడు మనల రక్షించునా? నీ వంతైనది-నేనూ ప్రార్థించి చూస్తాను. లాభ ముండదని ఎరిగినా మానుషయత్నమున కొరత ఉంచను. (రుద్రదాముసితో) అమాత్యరుద్రదాములుగారూ, మీ రిప్పు డధికారారూఢులు, నే నొక బ్రాహ్మణుడను, వృద్ధుడ, పేరు మాధవుడు, కార్యార్థినై విన్నపము చేసుకొన వచ్చినాను. పరమేశ్వరుడు మీ హృదయమున చొచ్చి మీ మానసమును దయార్ద్రమొనర్చు గాక-వీరవిజయునికీ నాకూ ఎట్టి సంబంధ మూ లేదు. కూతురువలె నేను చూచుకొనుచున్న ఈగోల తనప్రాణములన్నీ అతనిపై నిక్షేపము చేసింది-బ్రతికిన ఇద్ద రూ బ్రతుకవలెను, లేదా ఇద్దరూ మరణించ వలెను-వారి పర స్పరానురాగ మట్టిది. కావున ఆదంపతుల ప్రాణములునిల్పు

డని మిమ్ము వేడుకొంటూన్నాను. ఎన్నడూ పరుల వేడ లేదు. మీ చిత్తము మా భాగ్యము.

రుద్ర—అయ్యా అమాత్యమాధవాచార్యులవారూ, మీరు ప్రశ్న చెప్పితిరే నా శిరస్సు ఉత్తరింపబడునని... అధికారము యువకులనే కాక వృద్ధులను కూడా మత్తులను చేయునని అనుభవసిద్ధమయిందా? మీరు సకల విద్యాపారంగతులని వదంతి... కాని ఈస్వల్పవిషయము మీరు తెరుగలేకపోవడ మాశ్చర్యమే. యావజ్జీవమూ రాజకృపాచ్ఛత్రమును ధరించి యుంటిరి. కనుక దైవదుర్విపాకమును ఎండదెబ్బ తినలేదు. భగవంతుడు మీకు దీర్ఘాయువు నొసగినందుకు ఫలము చూచినారా? అవమానమూ దైన్యమూ మానవుని ఎట్లు అణగదొక్కునో మీ కనుభూతమైనది! ఏ సమయమున కెట్టి దశ ప్రాప్తించునో తెలియదు. మీకు యావజ్జీవమూ ఉచ్ఛదశయందే ఉందుమని తలచి ముందు వెనుక లారయక పురోవృద్ధి చెందదగిన మాబోంట్ల నెట్లు నిరసించుచుండిరో కొంచెము జ్ఞప్తికి తెచ్చుకొనండి. మీ రేఖ అప్పుడు ఉచ్ఛదశయందుండెను-ఇప్పుడు దానికి నీచత్వ మలవడినది. భాగ్యచక్రము మా కనుకూలించింది. లక్కకి లక్కయే ఉత్తమమార్గము. ఎంతో ప్రయాసపడి చేజిక్కించుకొన్న శత్రువును విడనాడి, పరమసౌఖ్యసామ్రాజ్యమున ప్రవేశింపచేయ సమర్థురాలైన పడతిని గోల్పోవువాడు పరమమూర్ఖుడు కాడా? కనుక వీరవిజయుడు చావక తీరదు, హంసేశ్వరి నాకు దక్కక తీరదు-ఇవి

బీరములు కావు, యదార్థ వచనములు... ఓరీ-నీవు పోయి వీరవిజయు నంత మొందించుమని అధ్యక్షునితో చెప్పు—
ఆజ్ఞాపత్రము పంపుతాను పొండి
(రుద్రదాముడు పోగా బంట్లు వీరవిజయుని గొంపోదురు)

హంసే—నాన్నగారూ, ఇక నాకెవ్వరు శరణ్యులు? మీ కళ్ళయెదుటనే మీ కూతురూ అల్లుడూ మృతిచెందుతూ ఉంటే మీ దూరకుందురా?

మాధ—అమ్మా, ఖైదీ ప్రాణములు తీసేటప్పుడు మహారాజుగారితో మనవిచేసి వారియాజ్ఞ గొనవలెను. కావున మహారాజుగారి అనుజ్ఞ అగువరకూ వీరవిజయుని వధింపజాలరు. కనుక, నీవు తక్షణమే పోయి, వీరవిజయుని రహస్యముగా చంపుతూన్నా రనీ, అట్లైన నీవుకూడా అతనితో మరణింతు వనిన్నీ, రుద్రదాముడు ప్రభువువారికి తెలియజేయకుండా ఇంకా ఎందరినో చంపిస్తూన్నాడనీ రాజుగారితో చెప్పి, ఇక్కడికి వారు వచ్చునట్లు చేసి, కారాగారాధ్యక్షునితో నామాటగా వీరవిజయుని హత్య కొంచెము సేపాపుమని చెప్పి, మీనాక్షీ నీవూ అక్కడే ఉండండి, హత్య కానీయకండి. నేను వీని నిక్కడనుండి కదల నివ్వను.

(హంసేశ్వరి పోవును)

(రాజూ రాణీ సేనానియూ వత్తురు, రుద్రదాముడు ఆజ్ఞాపత్రముతో వచ్చి వారికి నమస్కరించును)

మాధ—మహారాజా! అవిచారముపరమావధి నందె

నది, కృతఘ్నత మిన్నంటిందిః నేనిక ఈరాజ్యమున గుక్కెడు నీరు గ్రోల నొల్లను- ఇన్నాళ్ళూ సంతతమంగళనిధాన మగు ఈరాజ్యము నా కిప్పుడు వెగటు పుట్టిస్తూన్నది. కాలమహిమ! మానవులసంపద వస్తువైభవము న్నూ కలకాల ముండబోవు- సుఖ మనుభవిస్తూ ఉన్నా మానవస్వభావము మార్పు కోరుతూండును. ఇంతకాలమూ నౌకరిచేసి అలసిన నాకు విశ్రాంతి నొసగవలెనని ప్రభువువారికి ఇచ్ఛ పొడమినట్లుంది- అది యుక్తమే-పాత రోతగించు ననుట నిజము-ఇదే నా సర్వాధికారములూ త్యజిస్తూన్నాను-మీ చిత్తము వచ్చిన వారికి ప్రసాదించండి.

హంసే—అయ్యో! ఇక నాకు దిక్కెవ్వరు?

మాధ—మీరు వృద్ధులవుటచేత కృష్ణదేవ రాయునకు యువరాజపదవి నొసగ నిర్ణయించిరట, అది ఉత్తమము. ఇక ప్రధానిపదవి రుద్రదామునికి చెందనున్నది కాబోలు అదీ సర్వోత్కృష్టమే. నాపదవిలో కూడా కొన్ని రాజకీయ పత్రముల నర్పించవలయును.

రాజు—మంచిమాట-రుద్రదామా, ఏమందువు?

రుద్ర—ప్రభుచిత్తము.

మాధ—ఇదిగో—మాలిక్ కాఫరు ద్వారసముద్రము పై దండెత్తినప్పుడు భల్లాళరాజులు మనసాయము కోరుతూ అంపుకొన్న విజ్ఞాపనము—(రాజుగారు పుచ్చుకొని రుద్ర దామునికిత్తురు)

(హనుమ లకోటా అమాత్యుని కందజేయును)

ఈ కాగితము ముఖ్యమైనదని నా శిష్యునిచేత తెప్పించినాను.

రుద్ర—ఇదేమిటి? వీ డెవడు? (వెలవెల బారును.)

మాధ—దీనిని ప్రభువువారు సావధానముగా పరిశీలించవలెనని నా ప్రార్థన.

రాజు—ఇది మీ పరాక్రమవిషయము కాదా?

మాధ—ప్రభూ! ఇది ప్రకృతమునకు సంబంధించినదే.

రాజు—ఇదేమో నా కవగతము కాలేదు.

మాధ—మీ అమాత్యుల నడగండి—రాణిగారికి కూడా ఇది విశదమే.

రుద్ర—(ఆత్రముతో) ప్రభూ! నాకు దయచేయుండి.

రాజు—(ఇవ్వబోవ వలదని మాధవాచార్యులు వారించును.)

మాధ—ప్రభూ! దీని నితరుల కివ్వవద్దు. ఎంతో ప్రయాసమున నాశిష్యుడు దీనిని సంగ్రహించినాడు-ఇదప్పుడే ఒకని చంపింది, ఐనా దీనికి తగిన శాంతి కాలేదు.

రాజు—అటులనా? (చదివి) ఏమీ మాలిక్కాఫరుకు వ్రాసినజాబు! సంతక మెవరిది? ఓహో! రాణిగారిది మొదటిది, కృష్ణరాయునిది రెండవది, రుద్రదామునిది మూడోది! మీరు ముగ్గురూ యవనసేనానికి జాబు వ్రాయడానికి హేతువేమి?

రుద్ర—ఇది అమాత్యులవారి పన్నగడ!

రాణి—ఏదీ ఇట్లివ్వండి- చూడకుంటే ఏమి చెప్ప గలను?

మాధ—మహారాజా! దాని నెవ్వరికీ యివ్వ వద్దని మొదటే మనవిచేసుకొన్నాను. నాకీర్తి దానియందే నిక్షిప్తమై యుంది.

రాజు—(తిరిగి చదివి) మన నగరము మీాదికి దండెత్తి రమ్మని దావూద్ ఖాం కాహాన్వయమా? ఇది మీారంపినారా? ఏమి ద్రోహము! (హనుమతో) ఓరీ, దీనిని నీకెవ రిచ్చినారు?

హను—ప్రభూ!దీని నెవ్వరూ నా కివ్వలేను. బలాత్కా రముగా రుద్రదాముని చేతినుండి దీనిని పెరికినాను.

రాజు—కారణ మేమి?

హను—మహాప్రభూ! భీమసింహునికి ద్రోహ మొనర్చి అమాత్యరుద్రదాముడు దీని సంపాదించగా వానితో పోరాడి నాచేత చిక్కించుకొన్నాను.

రుద్ర—ఇది కేవల కల్పితము-వీనిని నే నెప్పుడూ చూడలేదు.

హను—మహాప్రభూ! పురుష వేషమున వీరు నన్ను గాంచలేదు.

రుద్ర—సరిసరి-స్త్రీ వేషము వేసితివా! ప్రభూ ఇది బూటకమని గ్రహించినారా?

మాధ—రుద్రదామా! ప్రభువువారికి కూర్చిన బంధు వువలె నటించి నీవు విద్రోహము సల్పుచుంటివి-నిన్ను వలలో

వేసుకొనుటకు మేమూ నాటక మాడవలసి వచ్చింది- ఈతడు స్త్రీవేషమున నీచెంత జేరినప్పుడు నీవు మోహించి వీనిని వలలో వేసుకొనవలయునని కారాగారమునకు తీసుకొని పోతివి-అది నీవు మరచిన ట్లున్నావు-ఇదంతా కపటనాటకమే కాని లకోటా నీచేతినుండి సంగ్రహించడానికి వీడొనర్చిన పోరిలో మీకిద్దరికీ తగిలిన గాయములు మాత్రము యథార్థములు. మీ దుస్తులు తీసినట్లయితే కనబడును- సేనానీ, వీరి దుస్తులు తొలగించు-(అట్లు చేయ గాయ మందరూజూతురు) రుద్రదామా! ఇప్పు డేమందువు?

రుద్ర—ఏ మున్నది-అమాత్యమాధవుడు తన ప్రతిపక్షులను శిష్యులచేత చంపించుటకు వెనుదీయ డంపును.

(కారాధ్యక్షుడు వచ్చును)

అధ్య—మహారాజా! ప్రభువువారి యాజ్ఞానుసారము కారాగారమున బంధింపబడిన ఖైది భీమసింహుడు మృతుడాయెను.

రాజు—భీమసింహు డెవడు? వాని నిర్బంధింపుమని నే నెప్పుడు శాసించితిని?

అధ్య—ఈ యాజ్ఞాపత్రము తిలకించండి ప్రభూ!

(ఇచ్చును)

రాజు—ఇట్టి యాజ్ఞపై రాజముద్ర వేసినట్లు నాకు యాది లేదు.(రాణీరుద్రదాములనుజూచి) ఇ దెవరు చేసినారు?

రాణి—రుద్రదాముని ప్రోత్సాహమున నేనుచేసినాను.

రుద్ర—దేవీ, నే నొంటిగా దీనిని చేయుమన్నానా?

రాజు—మీరిద్దరూ తోడిదొంగలు-సరే భీమసింహు డెవడు?

రాణి—అమాత్యమాధవులు మరణించిరని చెప్పిన వాడు. అందుకే వాని శిక్షించినాము.

మాధ—అంతే కాదు-రాణిగారూ రుద్రదాము డునూ చేరి నన్ను చంపుటకు పంపినవాడు-నాచావు తప్పింది, ఆప్రయోజకత్వము భీమసింహునిదీ కాదు, రుద్రదామునిదీ కాదు.

రాజు—(అధ్యక్షునితో) ఆత డేలాగు మరణించెను?

అధ్య—నూతనామాత్యులైన రుద్రదాముగారు భీమసింహుని చెల్లెలిని వెంటబెట్టుకొని కారాగారమునకు విచ్చేసి భీమసింహుని చేతినుండి లకోటాను గ్రహించడమునకై వానిని కత్తితో పొడిచిరట-గాయము లోతుగా మర్మములపై తగిలినందున వైద్యు లెంత చికిత్స చేసినా కార్యము లేక పోయింది.

రాజు—సరే-తోలుత యవనసేనాని నాహ్వానించుచుతూ లకోటా వ్రాసి, అది వారి కందలేదని' గ్రహించి, తనచేత చిక్కించుకోవడానికి చేసిన యత్నమా యిది? యవనుల కీ యుత్తరము నందకుండా చేసిన దెవరు?

హను—మహాప్రభూ! వీరవిజయుల నడిగితే ఆనంగతి విశదము కాగలదు.

రాజు—వీరవిజయు డీప్రాసాదమున నుండవలయునే?

మాధ—అది మీయాజ్ఞ, కాని అమాత్యరుద్రదాములవారు రేపు వీరవిజయుని చంపించ నుద్యమించి కారాగారమున నొక చీకటికోణమున నిర్బంధించిరి-ఈసందర్భమున వారే ఆజ్ఞాపత్రము వ్రాసినారు-అది వారివద్దనే ఉంటుంది.

రాజు—రుద్రనామా! ఏదీఆజ్ఞాపత్రము? రాజబంధువుల చంపించు నధికారము నీ కెవ్వ రొసంగిరి?

రుద్ర—మహారాణిగారి యాజ్ఞను రాజాజ్ఞగా భావించడము సేవకుల విధికాదా? (ఆజ్ఞాపత్రము నిచ్చును)

రాజు—బాగుబాగు-మీ రిద్దరూ ఒకరి యాజ్ఞ నొకరనువర్తించి ఈ రాజ్యమును ఏమి చేయనెంచినారు? దావుదుఖానును పిలిచి మీరు నిర్వహింపదలచిన కార్యమేది?

రాణి—ఇందువల్ల మేము జుర్రుకొనదలచిన దేమీ లేదు-మీ ప్రతిష్ఠ నిలువ బెట్టడమే.

రాజు—భళిరే! నాప్రతిష్ఠ కాపాడడానికి నావైరిని నసైన్యము రప్పించెదరా? నన్నంతమొందిస్తే నాప్రతిష్ఠ నిలుస్తుందా? ఏమి దురూహ్యా రాజనీతి! ఈయూహా నీకే తోచినదా?

రాణి—హరిహరీ! ఎంత మాటాడుతూన్నారు
(ఏడ్చును)

మాధ—సేనాధిపా-మీకృపాణిని కాలితో తన్నిన అవమానము రాణిగారి పశ్చాత్తాప బాష్పములతో పోవు

నన్నాను-జ్ఞాపకమున్నదా?

రాణి—చూచినారా, మహారాజా! మీా యెదుట మీా అర్ధాంగి నె త్తిపొడుస్తున్నారో-ఆడవారము-ఏమవక మేమేమి చేయగలము?

మాధ—ఏమి? రాజకార్యము లన్నీ నిర్వహించ గలరు. ద్రోహుల ప్రాణములు తీయగలరు-పర రాజులతో రాజకీయవ్యవహారముల గూర్చి ఉత్తరప్రత్యుత్తరములు వ్రాయించగలరు-రహస్యాలోచనకు వారు పెట్టినపేరు?

రాజు—పురుషులవలె ప్రతివ్యవహారమూ నడుప గలరు, రాజ్యము లేలగలరు! సరే-దాడీదుఖాం కేల జాబు వ్రాసినారు?

రాణి—మీాతో నెన్నిసారులు మనవిచేసినాను మాధవాచార్యుల భారము తగ్గించండని?

మాధ—వృద్ధు యువకులకన్న అల్పజీవులు, గళిత వివేకులని నే నెన్నో సారులు మనవిచేయడమే కాక అమా త్యపదవి వీడి సన్యసించవలెనను కోర్కెను పలుసారులు సూ చించినాను-మహారాజదంపతులు దానిని లెక్కచేయలేదు. నాయధికారము నిప్పుడే స్వీకరించినట్లయితే కొద్దికాలములో మహారాజుగారి యధికారమూ స్వీకరింపవచ్చును.

రాజు—అమాత్యులవారి పల్కులు యథార్థములు, వారు బ్రాహ్మణులు బ్రహ్మచారులు కావున ఆత్మసంయమ మాచరించి ఇహమును రోతగించగల్గినారు, నేను క్షత్రియు

డను అధికారభోగలాలస విడువలేకున్నాను. అమాత్యుల వారి అధికారభారము తీర్చవలెనంటే యువనవాహిని యేల? ఇంకేదో కారణ ముండవలెను.

రాణి—అదీ మీ కోరిన దే-కృష్ణరాయనికి యువ రాజపదవి నొసగండని నేను మొరపెట్టగా మీరు సమ్మతించి నారే కాని అమాత్యుల మోమోటముచేత కార్యరూపమున పరిణమింపచేయలేకుండిరి-వారికి రాజద్రోహియైన వీరవిజయుని యందు అభిమానము హెచ్చవడముచేత అతనిని యువ రాజుని చేయ వారు నిశ్చయించినారు, కనుక మీ ఆటలు సాగనివ్వలేదు. అదీకాక రాజద్రోహు లందరూ దళబద్ధులై దుర్వ్యూహము పన్నినారని తెలియవచ్చినది, అట్టివారి కడ్డు కర్రగా సేనను రప్పించడమయినది.

రాజు—వహ్వారే!...మాధవాచార్యులవారు రాజ ద్రోహులూ మీరు రాజభక్తులునా? రహస్యముగా వా రేమి చేసినారో తెలియలేదు, కాని మీ రాజభక్తిమాత్రము మాకు పరమసుఖదాయకమైనదే! మనదేశమందలి ద్రోహుల నడచడానికి యువనసేన రప్పించినారా? (భటులు వీరవిజ యుని తీసుకొనివత్తురు. వారివెంట హంసేశ్వరీ మీనాక్షీయూ వచ్చెదరు )

మాధ—నిజమైనద్రోహు లెవరో ఇప్పుడు తేలుతుంది- మహాప్రభూ! ఇదే వీరవిజయుడు, లకోటాను గురించి ప్రశ్నిం చండి.

రాజు—వీరవిజయూ, లకోటా వృత్తాంతము నీ కెరిగి నంత దాచక చెప్పు.

వీర—రుద్రదాము డీ లకోటా దాఉద్‌ఖానుకి పంప నున్నాడని ఎరిగి అందువల్ల మన రాజ్యమునకు ముప్పు మూడు నని గ్రహించి హనుమనుండి దానిని పుచ్చుకొని భీమసింహున కిచ్చి తురకల కందనివ్వకుండా భద్రము చేయుచున్నాను.

రాజు—భీమసింహు డమాత్యమాధవాచార్యులవారి ప్రాణములు గొన కృతనిశ్చయుడై యుండెను కదా అట్టివాడు నీకు మిత్రు డెట్లయ్యెను?

వీర—నా మానసమునకు శూలాయమానమైన ప్రశ్న యిది, ఐనా ప్రభువారు న్యాయమూర్తులు కనుక ఇసుమంతా దాచక మనవిచేసెదను. ప్రభూ! అమాత్యుని చంపుట కుద్య మించినవాళ్ళలో ముఖ్యుడను నేను.

రాజు—చిత్రమే! ఇందుకు హేతువేమి?

వీర—ప్రభూ! భ్రాంతియే దానికి హేతువు. నాకు కారావాస మమాత్యుని మూలముగా సంభవించిందని అపోహ ముండెను.

రాజు—రామరామ! మేము రుద్రదాముని మాటవిని నిన్ను చెరలో బంధించినందు కమాత్యులవారు మాతో కల హించి, మాకు ప్రతిగా తమ పూచీమీాద నిన్ను విడుదల చేసినారు.

వీర—రుద్రదాముడు నా కత్యంత మిత్రునివలె నటించి

యథార్థమునకు విరుద్ధముగా బోధింప వానిని నేను విశ్వ
సించినాను.

మాధ—మహాప్రభూ, వీరవిజయుని స్వభావము మీ
కిప్పుడెట్లగపడినది ?

రాజు—నాటి క్షత్రియులు, సేనానులు, రాజభక్తులు
కదా, రుద్రదాసా, వీరవిజయుని యెడ నీ కింతపగ యేల?

హంసే—నాన్నగారూ? ఈవిషయమున నేను కొంత
చెప్పవలసి ఉంది. సిగ్గు, బిడియము విడిచి న్యాయమూర్తులైన
మీ ఎదుట నిజము చెప్పుతూన్నాను. రుద్రదాసుడు వీరవిజ
యుని ప్రాణముల హరింప నున్నాడని ఎరిగి, వానినెట్లైనా
బతిమాలి ప్రాణరక్షణ మొనర్పదామని పోగా ఆతడు నన్ను
మోహించి మిమ్మ అనరాని మాటలనెను. అవి మీతో
మొరపెట్టుకొందామన్న మీదర్శనము కానీయలేదు.

రాజు—ఎవరు?

హంసే—అమాత్యరుద్రదాసులే!

రాజు—ఔరా, పదవి నందకముందే ప్రజాపీడనము
నకు రాజద్రోహమునకు గడంగిరే! వీరు నిజముగా అమా
త్యులైతే రాజ్యముకూడా స్వాధీనము చేసుకొనరా! కానీ,
అదృష్టవశమున వేళకే మెలకువ వచ్చింది-ఓయీ? వీరవిజ
యుని సంకెళ్లు విప్పి రుద్రదాసుగారి కలంకరించండి.

మాధ—అమ్మా! హంసేశ్వరీ! చూచినావా రాజ
కృపాప్రభావము, ఒక్కకిరణము ప్రసరించి ప్రజాపీడనాంధ

కారమునెట్లునశింపజేసెనో. మీనాక్షీ! రాజద్రోహివిషాంకురములు పెరికి వైచుటలో హనుమా నీవు నొనర్చిన సేవకు పారితోషికముగా మీకిద్దరికీ వివాహము సమంజసము. మహారాజుగారు మీకు తగిన జీవనోపాధి కలుగజేసెదరు.

రాణి—ఈ మీనాక్షీ నాకు విశ్వాసార్హ వలె నటించి వీరి కుచక్రమందు చేరిందా?

మాధ—కుచక్రము పన్నినవాళ్ళము మేమా? అది పన్నినవారు మీరు, దానిని భంగమొనర్చుటకు మేమూ ఒక కపటనాటక మాడవలసివచ్చింది-మహాప్రభూ, మీనాక్షీ హీనకులసంజాతైనా దాని రాజనీతినైపుణీ రాజభక్తిన్నీ ప్రశంసార్హము లవుటచేతనే దానిని నా పరివారమున చేర్చి హంసేశ్వరికి తోడు చేసితిని. వారి శీలము లతిపవిత్రములు.

రాజు—అమాత్యమణీ, ఈద్రోహుల మాటలు విని నేను మీయెడ అపరాధి నైతిని, క్షమించండి.

మాధ—ప్రభూ! అట్లనవద్దు-నే నంతా ఎరుగుదును. మీరు వీరవిజయుని క్షమిస్తే నాకు సర్వశుభములూ చేకూర్చినట్లే-సమర్థుడైన రాజకుమారుడు, వీరుడూ, గుణసంపన్నుడూ నైనవాడు-అట్టివాడు తమ గౌరవమునకూ విశ్వాసమునకూ అపాత్రుడు కాడు...ఇంకొక మాట-అతడు హంసేశ్వరికి ప్రియుడవుటచేత నే నిదివరకే వారికి గాంధర్వ వివాహము చేసినాను. అది మీ రంగీకరించవలెనని ప్రార్థిస్తూన్నాను.

రాజు—ఇది న్యాయమే. హంసేశ్వరీకృష్ణరాయల

కన్యోన్యానురాగము కలదని నమ్మియుండడముచేత వారికి వివాహము చేయ సమ్మతించినాను. అది మాయ...వీరవిజయా, అపోహముచేత నిష్కారణముగా నిన్ను క్లేశపెట్టినాను. నీవు మా వంశజుడ వగుట హంసేశ్వరీప్రణయము నీకు యోగ్యమే. నేను వృద్ధుడనై తిని కావున హంసేశ్వరితో బాటు విజయనగర రాజ్యేశ్వరిని కూడా నీ కప్పగించుచున్నాను.

సేనా—జే! వీరవిజయ యువరాజునకు జే!

మాధ—ఇక నాపని సరి కావున మీరందరూ నాకు సన్యసించ నాజ్ఞ నొసగండి. (లోన శంఖనాదము)

రాజు—సేనానీ, ఆధ్వనేమి? (అతడు పోవును) అమాత్య శిరోమణీ, మీరు సన్యసించియే యున్నారు. కాని ఈ రాజ్యమందలి ప్రేమ అను రజ్జువు మి మ్మిహామునకు బంధించినది; దాని తెగగోయుట మీచేతిలో నుంది. భటులారా, (రుద్రదాముని చూపి) ఈద్రోహిని పనగుచేత తొక్కించండి.

మాధ—మహాప్రభూ! వీనిని జంపించ నేల? అల్పుడు! మీరూ రాణిగారూ విశ్వసించినారు కావున రెక్కవురుగు వలె కొంతసేపు చెలరేగినాడు. స్థానబలిమే కాని వాని బలిమి నున్న. కావున వీని నానగొంది కారాగారమున యావజ్జీవము బంధించిన చాలును- చంప నక్కరలేదు.

రాజు& వీర—ఉదారుల రీతి యిట్లే ఉండును.

(సేనాని వచ్చును)

సేనా—మహాప్రభూ! శ్రీశృంగేరీపీఠాధికారులనుంచి

అమాత్యమాధవులను తక్షణమే అంపుడని వార్త వచ్చింది.

మిళిం—శ్రీవారు దయచేసిన పత్ర మిదిగో (రాజ కిచ్చును.)

రాజు—ఏమి వీరి భాగ్యము! (అమాత్యుని కిచ్చును)

మాధ—నాకు పల్లకి ఏల? అధికారమును విడుచువాని కందలమా? పరిహాసాస్పదము!

మిళిం—ఆచార్యవర్యా! ఇది విద్యను బహూకరించడము.

మాధ—మేలైనమాట నేనేవో కొన్ని గ్రంథములు రచించినాను. వాటిని శ్రీజగద్గురు శంకరాచార్యులవారి భవ్యచరణముల కర్పించి కృతార్థుడ నయ్యేదను. శాంభట్టూ, ఆగ్రంథములు శ్రీవారిపాదుకల యెదుట నుంచు. మహాప్రభూ! నాకు సెలవు దయ సేయుడు-

రాజు—అమాత్యవర్యా, పూర్వయుగముల బ్రాహ్మణులు ఆత్మనియమపట్టభద్రులై "శాపాదపి శరాదపి" అనిద్వివిధ కర్మల నాచరించి యశస్సాంద్రు లయినారు-ఈయుగమున విద్యాసంపాదనమూ రాజ్యకార్యనిర్వహణమూ అను ద్వివిధ కర్మలు నిపుణతతో నిర్వర్తించి మీబోంట్లు ఇహపరము లార్జింతురు. కాలానుగుణముగా జరిగిన మార్పిది. కావున మీ యశస్సు సేతుహిమాచలమూ వ్యాపించి ఆచంద్రతారార్కమవును. మీబోటి ఋషుల సంసర్గ మబ్బినందుకు మేము ధన్యులము. కైవల్యమూర్తీ, పరమహంసపరివ్రాజకాచార్యశ్రీవిద్యా

రణ్య జగద్గురూ, నావందనము చేకొనండి. శ్రీవిద్యారణ్యస్వామి నేనమః॥

మాధ—వీరవిజయయువరాజా! హంసేశ్వరీ! మీా రన్యోన్య ప్రేమమున ప్రభుభక్తిపరాయణులై వర్ధిల్లండి. నే నిక పోయి వచ్చెదను. సమస్త మంగళాని భవంతు. స్వస్తి ప్రజాభ్యః.

—: సమాప్తము :—



